# యువ విజేతలు



మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా యువ విజేతగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street,
Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## బ్యాడ్మింటన్ స్టార్

సాయి దినేష్ రెడ్డి 1999 మే 6న జన్మించాడు. ముంబై, చెంబూరులోని ఒఎల్‌పిఎస్ స్కూల్‌లో 7వ తరగతి చదువుతున్నాడు. చిన్నవయసులోనే బ్యాడ్మింటన్‌లో నిపుణుడయ్యాడు. సాయికి బ్యాడ్మింటన్‌పై మక్కువ ఏర్పడటానికి తన తండ్రి ప్రోత్సాహం ముఖ్యకారణం. చిన్నప్పుడే అనేక విజయాలు సాధించాడు. 2011లో జరిగిన 25వ సబ్ జూనియర్ నేషనల్ ఛాంపియన్‌షిప్‌లో అండర్ 13 బాయ్స్ డబుల్స్ ఈవెంట్‌లో ఇతడు వెండి పతకం సాధించాడు. 2010, 2011లో అండర్ 13 బాలుర సింగిల్స్, డబుల్స్ పోటీల్లో ఇతడు అఖిల భారత స్థాయిలో 5వ ర్యాంక్ సాధించాడు. సబ్ జూనియర్ నేషనల్ బ్యాడ్మింటన్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో ఇతడు మహారాష్ట్ర జట్టుకు ప్రాతినిధ్యం వహించాడు. గత నాలుగు సంవత్సరాలలో ముంబై స్కూల్ స్పోర్ట్స్ అసోసియేషన్ తరపున అండర్ 10,12, 14 విభాగంలో స్వర్ణపతకం సాధించాడు. అలాగే అండర్ 10,13 విభాగంలో ముంబై జిల్లా బ్యాడ్మింటన్ ఛాంపియన్‌షిఫ్ పోటీల్లో నాలుగు సార్లు విజేత అయ్యాడు. మనోరా టోర్నమెంట్‌లో ఇతడు 10 సార్లు విజేతగా, 3 సార్లు రన్నర్‌గా నిలిచాడు. తన వయస్సు పిల్లలకు మల్లే ఇతడు కార్టూన్ నెట్‌వర్క్‌ని ఇష్టంగా చూస్తాడు. 2016 ఒలింపిక్స్ పోటీల్లో భాగం కావాలన్నది సాయి చిరకాల స్వప్నం.


November 2012 ₹ 25/-
Founded by B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editor :**
R. Vaasugi
**Sub Editor :**
Patricia Pandian
**Senior Artists :**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar.
**Layout Designers :**
B. Thirumal, N. Sivakumar.
**Production In-charge :**
Prashant Pawar
**Circulation :**
circulation@chandamama.com
**Assistant Managers - Sales & Circulation :**
Rajendra K. Jadhav, Subhankar Rej.
**Sales Officer - Circulation :**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Customer Help :**
Ph: 022 40786043
**Head Office :**
CHANDAMAMA INDIA LTD.,
P.O. Box No : 19407,
Mumbai - 400 093.
Phone : +91 22 28312872 / 28311849
Email :
chandamama@chandamama.com
Website :
www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Mulekar
Published At : B-3, Lunic Industries, "B" Cross Road, Opp.SBI, MIDC, Andheri (E), Mumbai - 400 093.
Printed At : Mothers Graphics (I) Pvt. Ltd., 91D, Govt. Ind. Estate, Charkop, Kandivali (W), Mumbai - 400 067.
Editor : Prashant Sharad Mulekar
T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 November 2012 Issue-11

# దీపాలు, సంబరాలు, కార్యాచరణ

జీవితం చాలా అనిశ్చితత్వంతో ఉంటుంది. నేటికాలంలో మనం దీన్ని మరింతగా అనుభవిస్తున్నాము కూడా. రెండు నెలలకు ముందు ప్రపంచమంతా పెనుచీకట్లు ఆవరించాయి. సకలదేశాలు దశానిర్దేశం లేని స్థితిలో స్తంభించిపోయిన ఆర్థికవ్యవస్థలను ఒడ్డున పడేయడానికి తీవ్రంగా ప్రయత్నించాయి. పరిస్థితి నాటకీయంగా మారలేదు కాని, భయాందోళలను తొలగించడానికి దేశాధినేతలు ప్రయత్నించడంతో ఇప్పుడు కాసింత వెలుగురేఖలు కనిపిస్తున్నాయి. భారత్‌లో కూడా చాలాకాలంగా విధానపరమైన పక్షవాతం స్థిరపడిపోయిన తర్వాత, ప్రభుత్వం ఎట్టకేలకు మేల్కొని, తగిన చర్యలు తీసుకోవడం ప్రారంభించింది. ఇది దేశానికి మేలుచేయడమే కాకుండా దేశంలోపల సానుకూల తత్వానికి కూడా మనం సాక్షీభూతులం కానున్నాము. చివరకు వరుణుడు కూడా కాస్త కనికరం చూపడంతో, వర్షపాతం క్రమేణా పెరుగుతోంది.

ఈ నెలలో మనం దీపావళి జరుపుకుంటున్నాము కనుక మనం సానుకూల దృష్టిని కలిగివుంటాము. అందరం మన ఊహలను విహరింపజేస్తూ, కొవ్వొత్తులను, రంగురంగుల కాగితపు లాంతర్లను, తయారుచేస్తూ పండుగ స్ఫూర్తితో గడుపుదాము. అదే సమయంలో హద్దుమీరిన శబ్దాలు సృష్టించకుండా జాగ్రత్తపడదాము. పాఠకులను దీపావళి సందర్భంగా తమ సృజనాత్మక రచనలను, చిత్రాలను పంపించవలిసిందిగా కోరుతున్నాము. వీటిని మేము చందమామలో ప్రచురిస్తాము కూడా.

మా పాఠకులకు దీపావళి శుభాకాంక్షలు తెలియజేస్తూ, కొత్త సంవత్సరం మరిన్ని సిరులను కురిపించాలని కోరుకుంటున్నాము. దీపావళికి అత్యంత ఆసక్తి, ఉత్సాహాలతో స్వాగతం పలుకుదాం రండి...

–సంపాదకులు





# పాఠకుల లేఖలు



గత నెల చందమామ సంచికను నెల చివరలో అందుకున్నాను. ఈ నెలలో ప్రచురించిన కథలన్నీ బాగున్నాయి. ప్రత్యేకించి ముద్రణ చాలా బాగుంది. తొలిపేజీ తెరవగానే పుస్తకం చాలా ఆకర్షణీయంగా కనిపిస్తోంది. ఈ సంచికలో వచ్చిన చిన్న కథలన్నీ అద్భుతంగా ఉన్నాయి, అర్థవంతంగా కూడా ఉన్నాయి. నేటికాలంలో కూడా పంచతంత్ర కథలను పిల్లలు ఆసక్తితో చదువుతున్నారు. ఎప్పటిలాగే ముఖచిత్రం అద్భుతంగా ఉంది.

–పి.రవీందర రావు, హైదరాబాద్

భారతమాతపై వడ్డాది పాపయ్య గారు చిత్రించిన ముఖచిత్రాన్ని ఆగస్టు 15వ తర్వాతే చూశాను. నెలలో మూడోవారంలో కూడా చందమామ సంచిక మార్కెట్లో లేకపోవడం బాగాలేదు. ఆలస్యంగా వచ్చినా సంచిక 20 కథలతో నిండుగా ఉంది. యధావిధిగానే బొమ్మలు సుందరంగా ఉన్నాయి. దేవుని నమ్మనివాడు అనే నా బేతాళకథను ఆగస్టు సంచికలో ప్రచురించినందుకు మీకు కృతజ్ఞతలు, ఈ నెలలోనే పారితోషికం, పత్రిక రెండింటినీ పొందటం మరీ సంతోషంగా ఉంది.

–పి.వెంకటేశ్వరరావు, జనుపల్లి, ఏపి.

పాత సంచికలతో పాటు జూలై చందమామను ఇటీవలే అందుకున్నాను. నా పరిశీలనలో చందమామ పాత చందమామలా చక్కగా వస్తోంది. కొత్తవి, పాతవి కథలన్నీ బాగున్నాయి. ఈ సంప్రదాయాన్ని చివరివరకు కొనసాగించాలని కోరుతున్నాను.

–లక్ష్మినారాయణ, బెంగళూరు

చందమామ అంటే నాకు చాలా ఇష్టం. ప్రతినెలా చందమామ కోసం ఆసక్తిగా ఎదురు చూస్తుంటాను. చందమామలో ప్రతి కథనూ నేను చదువుతాను. ప్రతి కథా చక్కని కూర్పుతో, నీతిబోధతో అలలారుతుంటుంది. చందమామ చదవటం ద్వారా నేనెంతో నేర్చుకున్నాను. ఇంత చక్కని సంచికను మాకు అందజేయడంలో సంపాదక బృందం గొప్పగా కృషి చేస్తోంది.

–శాంతి పంత్రి, డెహ్రాడూన్

చందమామ అంటే నాకు ప్రాణం. 1973లో ప్రచురించిన చందమామ పాత సంచిక ఒకటి నావద్ద ఉంది. ఈ రోజుకీ చందమామను అదే ఆసక్తితో చదువుతుంటాను. చందమామకు కృతజ్ఞతలు

– మంజిత్‌కౌర, ఉత్తర ప్రదేశ్

# చందమామతో నా జ్ఞాపకాలు - మరాఠీ

నేను చదవడం ప్రారంభించేటప్పటికి నా చేతిలో ఉన్న తొలి పుస్తకం చందమామ. తర్వాత ఎన్నో పుస్తకాలు చదివాను. చదివించిన పూర్తి ఘనత మాత్రం చందమామదే. తర్వాత నేను పుస్తకాలు వేగంగా చదవటం మొదలెట్టాను. చందమామలోని ఆకర్షణీయమైన, వర్ణరంజితమైన చిత్రాలు అంటే నాకెంతో ఇష్టం. దయ్యాలు లేవని ఈరోజు మనకు బాగా తెలుసు కాని బాల్యంలో చందమామలో నేను చూసిన దయ్యం 'బేతాళుడు' ఇప్పటికీ నాకు గుర్తుండిపోయింది. దయ్యం ఉందనుకుంటే అది నేను చందమామలో చూసిన దయ్యంలాగే ఉంటుందని ఖచ్చితంగా చెప్పగలను. అలాగే రాజులూ, రాజకుమారులు కూడా. రాణులను ఎవరైనా చూశారా? వారు చందమామలో నేను చూసిన రకం రాణుల్లాగే ఉంటారు. బాల్యంలో ప్రతి ఒక్కరూ చిత్ర ప్రపంచాన్ని ఇష్టపడతారు. చందమామవల్లే ఈ ప్రపంచం నిజంగా తెరుచుకుంటోంది. చందమామలోని ఒక పేజీ, రెండు, మూడు, నాలుగు పేజీల కథలు నిజంగా విందులాంటివి. కథ చదువుతున్నప్పుడే తర్వాతేం జరుగుతుందన్న ఉద్వేగం మనల్ని ఆవహిస్తుంటుంది. కథలు ఆసక్తికరంగా ఉండటమే కాదు నైతిక విలువలను కూడా అవి నేర్పుతాయి. కొన్నాళ్ల క్రితం ఒక కుర్రాడు కుటుంబం పట్ల తన బాధ్యతలు విస్మరించేవాడు. అతడికి ఎలా బోధించాలో నాకు తెలిసేది కాదు. కాని చందమామే నాకు ఈ విషయంలో సహాయపడింది. నేను అనువదించిన చందమామ కథను అతడికి చదివి వినిపించాను.



Name: Deepa Deshmukh
Occ: DOC head, Pratham InfoTech Foundation, Pune.

ఆ కథ ఏమిటంటే ఒక యువకుడు తన తండ్రికి వ్యాపారంలో చేదోడువాదోడుగా ఉండేవాడు కాదు. అతడి భవిష్యత్తు గురించి తండ్రి కలవరపడేవాడు. అతడు తన బాధ్యతలను ఎప్పటికి తెలుసుకుంటాడు అని బాధపడేవాడు. ఒకసారి వాళ్లు ఇంటికి వెళుతున్నారు. దారి మధ్యలో ఒక బాలిక తాడుపై విన్యాసాలు చేస్తూంటుంది. తన చేతుల్లో కర్ర ఉంచుకుని ఎత్తులో ఉండే తాడుపై ఆమె నడుస్తోంది. ఆ పాపను చూడగానే ఈ కుర్రాడు ఆశ్చర్యపోయాడు. తాడుపై నేర్పుగా నడవడం అంటే జీవితాన్ని నడవటం లాంటిదేనని తండ్రి అతడికి వివరిస్తాడు. ఆమె చేతిలో ఉన్న కర్ర జీవితంలో బాధ్యతల వంటిది. కర్రవల్లే ఆమె సమతూకంతో నడవగలదు. తండ్రి తనకు బోధించదలచిన పాఠం బాలుడికి అర్థం అయింది. ఈ కథ నేను చదివి వినిపిస్తున్నప్పుడు నాకు పరిచయమైన ఆ కుర్రాడు కూడా కథలోని సందేశాన్ని అర్థం చేసుకున్నాడు. ఈ రకంగా చందమామ మనకు స్నేహితుడు, తాత్వికుడు, మార్గదర్శకుడు. నా జీవితంలో రంగులు నిల్పిన చందమామకు అనేక ధన్యవాదాలు.

## Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamamashop.com & subscribe Now!!**



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 11 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ....................................................................................

Date of Birth: .................................. Sex :.........................................

Address: ...............................................................................

.................................................................................................

.................................................................................................

................................................... City: .........................................

State:........................................ Pin:...............................................

Telephone:...........................................................................

Mobile:.................................................................................

Email:...................................................................................

Subscription Number (for renewals):..........................................

Gift Subscription to the following address:

.................................................................................................

.................................................................................................

.................................................................................................

.................................................................................................

Enclosed Cheque/DD* for Rupees.................................................

Cheque/DD No ......................................................................

favouring Chandamama India Ltd on..........................................

..........................................................................................bank.

Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 30/- per copy) | Rs. 360 | Rs. 645 | Rs. 915 | Rs. 1150 | Rs. 1350 |
| You Save | | Rs. 75 | Rs. 165 | Rs. 290 | Rs. 450 |
| REGIONAL (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 260 | Rs. 375 |
| JUNIOR (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 765 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 195 | Rs. 300 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages. US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు - గుజరాతి

వెన్నెల చీకటిని వెలిగించిన విధంగానే చందమామ పత్రిక పిల్లలను, పెద్దలను వయసుతో పనిలేకుండా వెలిగిస్తుంది. చందమామ కథలు, వర్ణచిత్రాలు, ఉద్వేగాలు మన హృదయాలను తట్టి లేపుతుంటాయి. చంద్రుడు రాత్రిపూట ఆకాశంలో ఉదయిస్తున్నప్పుడు, ప్రతి ఒక్కరి హృదయం సంతోషంతో నిండుతుంది. చందమామ సంచికలు కూడా ప్రతినెలా అందరి హృదయాలను వెలిగిస్తుంటాయి.



Name: Dr. Sheela Nair
Trivandrum, Kerala

పదేళ్ల వయస్సు నుండి నేను చందమామను చదువుతుంటాను. నాకిప్పుడు 70 ఏళ్లు. కాని చందమామను చదవడంలో నాకు విసుగు అనిపించదు. మా నాన్న చందమామ పత్రికను తొలిసారిగా మాకోసం తీసుకొచ్చినప్పుడు నేను ఆశ్చర్యపోయాను. ఆ సమయంలో పత్రిక ధర 25 పైసలు. ఇంట్లోకి పత్రిక రాగానే నేను, చెల్లెలు, అమ్మమ్మ ఎవరు చదవాలనే విషయంలో పోటీ పడేవాళ్లం.

అదృష్టవశాత్తూ మా ఇంట్లో నాలుగు భాషలు రాజ్యమేలేవి. మా అమ్మమ్మ మహారాష్ట్రీయురాలు కాబట్టి నాన్న మొదట మరాఠి చందమామ(చందోబా)ను తీసుకొచ్చేవాడు. తర్వాత నాన్న గుజరాతీ, హిందీ చందమామలు తెచ్చేవాడు. ప్రతి నెలా పుస్తకాల షాపునుంచి నాన్న చందమామలను కొని తెచ్చేవాడు. మా అమ్మమ్మ అన్ని భాషల్లోనూ చందమామ చదివేది. ఆమె పోయిన తర్వాత మేము ఇంగ్లీష్ చందమామకు చందాకట్టి ఈరోజుకీ చదువుతూనే ఉన్నాము.

పలు సంవత్సరాల తర్వాత కూడా చందమామను మళ్లీమళ్లీ చదవటం నాకిష్టం. పాత సంచికలను చదవడానికి తీసుకున్నప్పుడు వాటిని తొలిసారిగా చదువుతున్నట్లే అనిపిస్తుంది. బేతాళ కథలు, పంచతంత్ర కథలు, విదేశీ జానపద కథలు అంటే నాకు చాలా ఇష్టం. పౌరాణిక గాథలంటే ఎంతో మక్కువ. రామాయణం, మహాభారతం, భాగవతం, బౌద్ధ జాతక కథలు ఎంతో ఇష్టంగా చదువుతుంటాను. ఈ కథలను మళ్లీ ప్రచురించాలని నా అభ్యర్థన.

ముసలితనంలో మేం చందమామ సంచికలను చదువుతున్నప్పుడు మళ్లీ పిల్లలమవుతుంటాము. ఈ వయసులో పిల్లల పత్రిక చదువుతున్నందుకు అందరూ నవ్వేవారు. వాళ్లు కూడా చందమామను చదివితే దాని గొప్పతనం వారికి అర్థమవుతుందని నేను చెబుతుంటాను. ఈ పత్రికకు వయోభేదం, కుల, మత భేదం లేవు. నింగిలోని చందమామ లాగే ఈ చందమామ కూడా శాశ్వతంగా వెలుగొందుకాక! కులమత భేదాలు లేకుండా ప్రజలందరూ చందమామను చదువుతూ ప్రపంచ శాంతికి తోడ్పడుగాక! చందమామకు నా శుభాకాంక్షలు.

# చందమామతో నా జ్ఞాపకాలు - తెలుగు

నాకు ఎనిమిదేళ్ల వయస్సు నుండి ఈరోజు-వరకు చందమామను కొని చదువుతూనే ఉన్నాను. చందమామ దొరకని రోజున నాకు ఏదో పోగొట్టుకున్న అనుభూతి కలుగుతుంటుంది. బేతాళ కథలు, విచిత్ర సహోదరులు నన్ను ఆకర్షించేవి. ఇప్పుడు కూడా నా చేతిలో చందమామ ఉంది. నెలరాగానే ఈ రోజుకీ చిన్నపిల్లలాగా ఆ పుస్తకం తెచ్చుకోవడానికి పరుగెత్తుతాను.



Name: B.Kamala
Occ: Retd. Telugu teacher,
Trimulgiri, Secunderabad.

ఇప్పుడు నాకు 7 2 సంవత్సరాలు. చిన్నపిల్లలా చందమామ చదువుకోవడం ఏమిటని అందరూ ఎగతాళి చేస్తుంటారు. నేను నవ్వుకుంటాను. నేనే కాదు. నా మనవరాలు దీప్తికి కూడా చందమామ చాలా ఇష్టం. చిన్నప్పుడు చందమామ కథ చెబితేనే అన్నం తినేది. తను ఇప్పుడు ఆస్ట్రేలియాలో ఉంటోంది. వచ్చినప్పుడల్లా నేను జమ చేసిన పుస్తకాలు తీసుకెళ్తుంది. పంచతంత్ర కథలు చాలా బాగుంటాయి. ఎప్పటి నుండో నా భావాలను చందమామతో పంచుకోవాలని ఉండేది. కాని మార్గం దొరకలేదు.

ఈ మధ్య కాలంగా ప్రచురిస్తున్న చందమామ జ్ఞాపకాలు చూసిన తర్వాత నాకూ అవకాశం దొరికింది. మధ్యలో కొన్నాళ్లు చందమామ ఆగిపోవడంతో చాలా బాధపడ్డాను. మళ్లీ దర్శనమివ్వగానే సంతోషమయింది. ఇంకా ఇంకా మంచి కథలు వేస్తూనే ఉండాలి.ఈ 'మామ'ను ఎప్పటికీ వచ్చేటట్టు చూడగలరు. అలాగే ఇంగ్లీష్ బాగా మాట్లాడటం నేర్చుకోవాలంటే నా సలహా ఏమిటంటే ఇంగ్లీష్ చందమామ చదవాలనే. నా సలహా పాటించి కొందరు పిల్లలు ఈ విధంగానే ఇంగ్లీష్ నేర్చుకున్నారు కూడా. 4వ తరగతి చదువుతున్న ఒక చిన్నారికి తెలుగు రాకపోతే నేనే ఆమెకు చందమామ ద్వారా తెలుగు నేర్పించాను. చిన్నవయసులో మాతృభాష, ఇంగ్లీషు నేర్చుకోవాలంటే చందమామను మించినది లేదు. చందమామకు నా అభినందనలు.



## బేతాళ కథలు

# సర్పముఖి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని మౌనంగా స్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా, నువ్వు ఈ అర్ధరాత్రి వేళ ఏ ప్రయోజనం ఆశించి ఇలా సంచరిస్తున్నావో నాకు బోధపడటం లేదు. బహుశా నీవు ఏ దేవతనయినా సంతృప్తి పరిచి నీ సమస్యలను పరిష్కరించుకోవడానికి ఈ విధంగా చేస్తున్నట్లయితే ఆ మేరకు నీ నిర్ణయం మంచిదే అవుతుంది. సర్పముఖంతో పుట్టిన తన కూతురుకు మానవ రూపాన్ని తెప్పించడానికి తీవ్రంగా ప్రయత్నించిన ఒక రాజు కథను ఈ సందర్భంగా నీకు చెబుతాను. తన ప్రార్థనలకు మెచ్చి నాగదేవత తనముందు ప్రత్యక్షమైనప్పుడు ఈ రాజు మరొక సమస్యను కూడా పరిష్కరించు కోడానికి ఈ అవకాశాన్ని ఉపయోగించుకున్నాడు. ఈ విశేషమేమిటో చెబుతాను, శ్రమతెలియకుండా విను,' అని కథ చెప్పసాగాడు.

జ్ఞానదీపిక రాజ్యం రాజు జీమూత వాహ



నుడు ధార్మికుడు. ప్రజాసంక్షేమ పథకాలు ప్రవేశపెట్టడంలోనూ, ప్రజల బాగోగులు చూడడంలోనూ అతనిది అందెవేసిన చేయి. జీమూతవాహనుడి పట్టమహిషి చూడామణి దేవి భర్తకు తగిన ఇల్లాలు. రాజదంపతులకు సందీపుడు ఒక్కడే కొడుకు. వయసు అయిదేళ్లు మించదు.

రాజదంపతులు ఒకసారి వనవిహారానికి వెళ్లారు. మధ్యాహ్నం భోజనానంతరం యువరాజుతో కలిసి తమ కోసం నిర్మించిన గుడారంలో విశ్రాంతి తీసుకోసాగారు. విశ్రాంతి సమయంలో వారికి చిన్నపాటి కునుకు పట్టింది.

ఆ సమయంలో నిద్రిస్తున్న యువరాజు మీద ఎండ పడసాగింది. అదే సమయానికి గుడారంలోకి ఒక నాగసర్పం వచ్చింది. బాలుడి మీద ఎండ పడడం చూసిన నాగసర్పం పడగ విప్పి యువరాజు శిరస్సుమీద ఎండ పడకుండా గొడుగు పట్టింది.

అదే సమయానికి కళ్ళు తెరిచిన మహారాజుకు ఆ దృశ్యం భయం గొలిపింది. అతను, నాగసర్పం నుంచి యువరాజుకు ప్రమాదం శంకించి ప్రక్కనున్న కత్తి అందుకుని పైకి లేచి తటాలున నాగసర్పం శిరసు ఖండించాడు. నాగసర్పం గిలగిలా కొట్టుకుని మరణించింది.

ఆ సవ్వడికి మేల్కొన్న మహారాణి జరిగిన సంఘటన తెలుసుకుని భీతిల్లి యువరాజును అక్కున చేర్చుకుంది. మరికొంచెం సేపటికి రాజదంపతులు, యువరాజుతో కలిసి అంతఃపురం చేరుకున్నారు.

ఆ సంఘటన జరిగిన కొంత కాలానికి మహారాణి చూడామణి దేవి గర్భం ధరించింది. ఆ శుభవార్త తెలుసుకుని మహారాజుతో పాటు, రాజ్యవాసులు ఎంతగానో సంతోషించారు. నెలలు నిండిన మహారాణి ఒక ఆడశిశువును ప్రసవించింది. ప్రసవించిన బిడ్డను చూసి మంత్రసానులు భీతి చెందారు. ఎందుకంటే జన్మించిన బిడ్డకు దేహమంతా మానవదేహమే కాని శిరసు స్థానంలో పాము తల ఉంది.

క్షణాల్లో ఆ వార్త మహారాజు చెవిన పడింది. అతను హుటాహుటిన అక్కడికి వచ్చి జన్మించిన బిడ్డను చూసి బాధతో విలవిల్లాడాడు. అతనా విషయం బయటకు పొక్కకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు.

రాజ్యవాసులకు మహారాణి, ఆడ శిశువును ప్రసవించిందన్న వార్త మాత్రమే తెలి

సింది గాని ఆ బిడ్డసర్పముఖముతో జన్మిం చిన విషయం తెలియలేదు.

అటువంటి బిడ్డ పుట్టడానికి కారణం మహారాజు నాగసర్పం శిరస్సు ఖండించడ మేనని మహారాణి భావించి మహారాజుతో మనవి చేసింది. మహారాజు సర్పదోష నివా రణకు పూజలు జరిపించాడు. అయితే ఫలితం కానరాలేదు.

జ్యోతిష్కులు యువరాణి జాతకం చూసి విషయం చెప్పడానికి తటపటాయిం చారు. మహారాజు పదే పదే అడగ్గా 'రాజా! యువరాణి జన్మ నక్షత్రాన్ని బట్టి త్వరలోనే రాజ్యానికి ఆపద రానున్నది' అని మనవి చేశారు. యువరాణికి రాగచంద్రిక అని నామకరణం చేశారు. రాజదంపతులు మాత్రం యువరాణిని సర్పముఖి అని పిలుచుకోసాగారు. జీమూత వాహనుడు ఎందరో రుషులను, మునీశ్వరులను కలిసి తనకు జన్మించిన బిడ్డకి మామూలు రూపు వచ్చేలా చూడమని ప్రార్థించాడు. అయితే వాళ్లు అదంత తేలికయిన విషయం కాదని తేల్చి చెప్పారు.

సర్పముఖికి అయిదేళ్ల ప్రాయం వచ్చింది. అంతలో రాజ్యంలో క్షామం అలుముకుంది. వర్షాలు పడలేదు. పచ్చటి పంట పొలాలు బీళ్లుగా మారాయి. త్రాగు నీటికి కటకట అయింది. పచ్చిక లేక పశు వులు మరణించసాగాయి.

ఆ పరిస్థితికి కారణం యువరాజు జన నమేనని అర్థం చేసుకున్నాడు జీమూత వాహనుడు. అతను ప్రజాక్షేమం గురించి విచారిస్తుండగా, అతని దగ్గరకు దివ్యచరి తుడు అనే సన్యాసి వచ్చి కలిశాడు. 'రాజా, నీ మనోవ్యాధి నాకు తెలుసు. సర్పముఖి జననం. రాజ్యంలోని క్షామం నీ మనసును కలిచివేస్తున్నాయి. అవునా,' అని అడిగాడు.

తను చెప్పకుండానే యువరాణి జన్మ





రహస్యం తెలుసుకున్న సన్యాసి సామాన్యుడు కాదని గ్రహించిన మహారాజు; 'అవును మహాత్మా! తరుణోపాయం సెలవీయండి,' అని ప్రార్థించాడు.

'రాజా! దీనికంతటికీ కారణం నీవు చంపిన నాగసర్పమే! నీడనిచ్చిన సర్పాన్ని తొందరపాటుతో చంపావు. ఆ దోషమే నిన్ను వెంటాడుతున్నది. నేను చెప్పినట్లు చేస్తే పరిస్థితి చక్కబడుతుంది. ఈ రాజ్యానికి దక్షిణదిశన నాగభైరవ కోన అనే ప్రదేశం ఉంది.

అక్కడ అతి పురాతనమైన నాగదేవత విగ్రహం ఉంది. నీవా ప్రాంతానికి వెళ్ళి నాగదేవతను క్షమాబిక్ష కోరి, పూజలు జరిపిస్తే మంచి ఫలితం ఉంటుంది,' అని చెప్పాడు.

జీమూత వాహనుడు, దివ్య చరితుడికి పాదాభివందనం చేసి 'మహానుభావా మీరు చేసిన సహాయం ఎనలేనిది. అందుకు కృతజ్ఞతలు,' అని చెప్పాడు.

శుభముహూర్తం చూసి జీమూత వాహనుడు, ఒంటరిగా అశ్వారూఢుడై నాగభైరవ కోనను వెదుక్కుంటూ వెళ్లాడు. వారం రోజుల ప్రయాణం తర్వాత అతడా కోన చేరాడు. అక్కడ నాగదేవత విగ్రహం కనిపించింది. జీమూత వాహనుడు అక్కడున్న కొలనులో శుచిగా స్నానం చేసి, చెట్లకున్న పరిమళభరిత పుష్పాలను కోసి వాటిలో నాగదేవతకు పూజ చేశాడు.

'మాతా! కన్న తండ్రినైనందున మమకారంతో, బిడ్డను రక్షించుకోవాలన్న తొందరలో నాగసర్పాన్ని చంపాను. అది తప్పే! అందుకు నన్ను శిక్షించు. అంతేకాని నా బిడ్డను గాని, రాజ్యప్రజలను గాని శిక్షించకు,' అని ప్రార్థించాడు.

కొద్ది క్షణాలకు ఆకాశంలో మెరుపు మెరిసింది. బలమైన గాలి వీచింది. అంతలో నాగదేవత విగ్రహం నుంచి 'రాజా! పశ్చాత్తాప హృదయంతో నన్ను వెదుక్కుంటూ ఇంత దూరం వచ్చావు. నిన్ను క్షమిస్తున్నాను. ఏం వరం కావాలో కోరుకో!' అన్న స్వరం వినవచ్చింది.

అప్పుడు జీమూతవాహనుడు, 'నాగదేవతా, నేను చేసిన తప్పిదం వలన జన్మించిన బిడ్డ సర్పముఖముతో జన్మించింది. ఆ బిడ్డకు మామూలు రూపం ప్రసాదించు. అలాగే రాజ్యంలో ఎన్నడూ లేని క్షామం అలుముకుంది. ఆకలితో ప్రజలు అలమటిస్తున్నారు. వర్షాలు కురిసి క్షామం తొలిగేలా చూడు,' అని

కోరాడు.

అప్పుడు నాగదేవత 'రాజా! నీ రెండు కోరికల్లో ఒక్కకోరికను మాత్రమే తీర్చగలను. ఒకప్పుడు తొందరపాటుతో నాగసర్పాన్ని చంపి చిక్కులు కొని తెచ్చుకున్నావు. ఈసారి అటువంటి తొందరపాటు ప్రదర్శించక నిదానంగా ఆలోచించి వరం కోరుకో!' అని చెప్పింది.

క్షణం ఆలోచించిన జీమూత వాహనుడు 'తల్లీ! రాజ్యంలోని క్షామం తొలిగేలా అనుగ్రహించు,' అని కోరాడు. 'తథాస్తు' అని దీవించింది నాగదేవత. జీమూత వాహనుడు సగం తృప్తితో, సగం అసంతృప్తితో అక్కడున్న నాగదేవత విగ్రహానికి నమస్కరించి వెనుదిరిగాడు.

అతను రాజ్యం చేరేసరికి వర్షం కురవడం ఆరంభమయింది. ఆ తరువాత కూడా విస్తారంగా వర్షాలు కురిశాయి. బీళ్ళుగా మారిన పంట పొలాలు చిగురించాయి. మెల్లగా రాజ్యంలో క్షామపరిస్థితులు పైదొలిగి ప్రజల కష్టాలు తీరాయి.

ఆ పరిస్థితులలో దివ్యచరితుడు మరలా రాజును కలిసి, 'రాజా! నేనొక శాంతియజ్ఞం జరిపిస్తాను. అందువలన అంతఃపుర పరిస్థితులు చక్కబడతాయి,' అని చెప్పి రాజదంపతుల చేత శాంతి యజ్ఞం జరిపించాడు.

కొద్ది రోజులు గడిచేసరికి యువరాణి రాగచంద్రికకు సర్పముఖం మాయమై మానవ శిరము ప్రత్యక్షమయింది.

రాజదంపతుల సంతోషానికి అవధుల్లేవు. సంతుష్టి చెందిన జీమూత వాహనుడు, దివ్యచరితుడిని ఘనంగా సత్కరించబోయాడు. అప్పుడు దివ్యచరితుడు 'రాజా! నీముందు నేనెంత? నాకెందుకు సత్కారం?' అని నిష్క్రమించాడు. మహారాజు, నాగదేవతకు రాజ్యంలో ఆలయం కట్టించి తన భక్తిని చాటుకున్నాడు.



అంతవరకూ కథ చెప్పిన బేతాళుడు, 'రాజా! ఒకప్పుడు తొందరపాటుతో నాగసర్పం శిరసు ఖండించిన జీమూత వాహనుడు, నాగదేవత తొందరపాటు నిర్ణయం తీసుకోవద్దని హెచ్చరించినప్పటికీ తన కుమార్తె బాగు కోరకుండా, క్షామం తొలగాలని ప్రార్థించడం అవివేకం కదా! ఎలాగూ కొడుకు ఉన్నాడు కాబట్టి ఆడపిల్ల ఏమైనా ఫర్వాలేదన్న చులకన భావంతో అలా ప్రవర్తించాడా? ఒక్క కోరికను మాత్రమే నెరవేర్చిన నాగదేవత కంటే,

శాంతియజ్ఞం జరిపించి యువరాణికి మామూలు రూపు తెప్పించిన దివ్య చరితుడు మహిమాన్వితుడు కాదా? ఒక్క కోరికను మాత్రమే నెరవేర్చిన నాగదేవతను అశక్తురాలిగా భావించి చిన్నచూపు చూడవలసిన జీమూత వాహనుడు, దేవాలయం కట్టించి ఎందుకు కృతజ్ఞత చాటుకున్నాడు? కాగా, దివ్యచరితుడు మహారాజును తనకంటే గొప్పవాడిగా ఎందుకు స్తుతించాడు?' అని ప్రశ్నించాడు.

అందుకు విక్రమార్కుడు, 'బేతాళా! రాజ్యంలోని క్షామం తొలగాలని నాగదేవతను ప్రార్థించడం ద్వారా జీమూత వాహనుడు రాజుగా తన ప్రథమ కర్తవ్యం నిర్వర్తించాడు. రాజుకు భార్య అయినా, బిడ్డలైనా ప్రజల తర్వాతే. అతనికా పరీక్ష పెట్టడానికే నాగదేవత ఒక్క కోరికను మాత్రమే నెరవేర్చగలను అన్నది. ఆ పరీక్షలో ఉత్తీర్ణుడు కావడం ద్వారా మహారాజు నాగదేవత అనుగ్రహం పొందగలిగాడు. కాబట్టి అతనా కోరిక కోరడంలో తొందరపాటు ప్రదర్శించాడు తప్ప అవివేక నిర్ణయం అనడానికి వీలులేదు.

నాగదేవత అనుగ్రహాన్ని అర్థం చేసుకోబట్టే దివ్యచరితుడు శాంతి యజ్ఞం జరిపించి కాగల కార్యం త్వరగా సానుకూలం అయ్యేలా చేశాడే గాని అందులో అతని దివ్య శక్తులేం లేవు. నాగదేవత ఒక కోరిక నెరవేరుస్తానని చెప్పి రెండో కోరికను కూడా నెరవేర్చడం అర్థం చేసుకోబట్టే జీమూత వాహనుడు దేవాలయ నిర్మాణం గావించాడు.

దివ్యచరితుడు, మహారాజును స్తుతించడానికి కారణం, తనవారిని త్యజించడం అన్నది సన్యాసులకే కష్టమైన విషయం. అటువంటిది మహారాజు ప్రజల క్షేమం కోసం కన్నబిడ్డ క్షేమాన్నే ప్రక్కన పెట్టడం చాలా అరుదైన విషయం. అందుకే అతను రాజును ప్రస్తుతించాడు,' అని చెప్పాడు.

బేతాళుడికి సరైన సమాధానం లభించడంతో శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

(కల్పితం)

(ఆధారం: ఎస్ శివనాగేశ్వరరావు)





# ధర్మాచరణ

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్త్వుడు ఇంద్రప్రస్థ నగరంలో ధనంజయుడనే కురురాజుగా జన్మించాడు. ఆయన పరిపాలనలో అతి వృష్టి, అనావృష్టి, మొదలైన పీడలేవీ లేకుండా ప్రజలు సుఖ పడుతూ వచ్చారు. ధర్మాన్ని పాటించటం లోనూ, దాన ధర్మాలు చేయటంలోనూ, ధనంజయుడికి సాటి ఎవరూ లేరన్న ఖ్యాతి జంబూద్వీపమంతటా పాకింది.

ఆ కాలంలోనే కళింగదేశానికి రాజధాని అయిన దంతపురమనే నగరాన్ని కాళింగుడనే పేరుగల రాజు పరిపాలిస్తూండేవాడు. ఆ రాజ్యంలో ఒక ఏడు వానలు కురవక కరువేర్ప డింది. ప్రజలు తిండికి లేక అల్లాడారు.

ఈ దుస్థితి చూసి కాళింగుడు తన మంత్రులతో ''ఈ యేడు మన దేశంలో ఇంత క్షామం ఏర్పడటానికేమి కారణం? ఈ పీడ తొలగించడానికి మనం చేయవలసినపని ఏమిటి?'' అని అడిగాడు రాజు.

''మహారాజా! ధర్మానికి హాని జరిగినప్పుడే ఇలాంటి ఉపద్రవాలు సంభవిస్తాయి. ఇంద్ర ప్రస్థం ఏలే ధనంజయుడు తన ధర్మాన్ని ఎంతో శ్రద్ధగా పాటించడం వల్లే ఆ దేశం కరువు కాటకాలు లేకుండా సుభిక్షంగా వుంటుంది,'' అన్నారు మంత్రులు.

''అలా అయితే, మీరు ఇంద్రప్రస్థం వెళ్ళి, ఆ ధనంజయ రాజు దర్శనం చేసుకుని, బంగారు రేకులమీద ధర్మాలన్నీ రాయించుకు రండి. వాటిని మనం కూడా అమలు చేసి అరిష్టాలు లేకుండా చేసుకుందాం!'' అన్నాడు కాళింగుడు.

ఆ ప్రకారమే కళింగ మంత్రులు కొన్ని బంగారు రేకులు తీసుకుని ఇంద్రప్రస్థానికి ప్రయాణమై వెళ్ళి, ధనంజయుడి దర్శనం చేసుకుని, ఆయనతో ఈ విధంగా అన్నారు:

''మహారాజా, మేము కళింగ దేశం నుంచి వస్తున్నాము. మా దేశప్రజలు భయంకరమైన క్షామంతో బాధపడు

జాతక కథ



తున్నారు. మీరు ధర్మం తప్పకుండా ప్రజలను పరిపాలిస్తుండటం చేత, మీ ప్రజలు ఈతి బాధలెరగక, సుఖంగా ఉంటున్నారు. మారాజు పాటించవలసిన ధర్మాలేవో మీరు ఈ బంగారు పత్రాలపై లిఖించి ఇచ్చినట్టయితే, మా రాజుగారు వాటిని అమలు జరిపి, ప్రజలను పీడించే కరువును పోగొట్టగలుగుతారు!''

ధనంజయుడు నమస్కారం చేసి ఇలా అన్నాడు: 'మహామంత్రులారా, క్షమించండి! నేను ఈ పత్రాలపై ధర్మాన్ని లిఖించడానికి తగినవాణ్ణి కాను. ఎందుచేతనంటే ఒకప్పుడు నా వల్లనే అధర్మం జరిగింది. మా దేశంలో మూడేళ్ళకొకసారి కార్తికోత్సవం జరుగుతుంది. అప్పుడు రాజు ఒక చెరువు గట్టున యజ్ఞం చేసి, నాలుగు దిక్కులా నాలుగు బాణాలు వదలాలి. ఒకసారి నేను వదిలిన బాణాలలో మూడు దొరికాయి, కాని నాలుగవది చెరువులో పడిపోయింది. అది చెరువులోపడినప్పుడు దాని విసురుకు చేపలూ, కప్పపిల్లలూ చచ్చిపోయి ఉంటాయి. ఆ విధంగా నేను ధర్మం తప్పాను. మరి మా రాజ్యంలో అరిష్టాలు లేవంటే దానికి కారకులు పరిపాలక వర్గంలో ఇంకెవరైనా అయివుండ వచ్చు. విచారించి చూడండి.'

ఈ మాటలు విని మంత్రులు ఆశ్చర్యపడ్డారు. వారు రాజమాత అయిన మాయాదేవి వద్దకు వెళ్ళి, ''తమరైనా మాకు ధర్మాలు రాసి పెట్టండి!'' అని కోరారు.

''అయ్యో, నాయనా! నేనూ ధర్మం తప్పిన దాన్నే. ఒకసారి నా పెద్ద కుమారుడు నాకు సువర్ణహార మొకటి కానుక ఇచ్చాడు. నా పెద్ద కోడలు ఐశ్వర్యవంతురాలనే ఉద్దేశంతో నేనా హారాన్ని చిన్న కోడలికిచ్చాను. కాని తరవాత నాలో కలిగిన భేదబుద్ధి నా కర్థమై బాధ కలిగింది. అందుచేత ఒకరికి ధర్మాలు రాసి ఇచ్చే అర్హత నాకు లేదు,'' అన్నది రాజమాత.

కళింగ మంత్రులు రాజభ్రాత అయిన నందుడి వద్దకు వెళ్ళారు. అతను తాను కూడా ఒకసారి ధర్మం తప్పినట్లు చెప్పాడు.

'నేను ప్రతి సాయంకాలమూ రాజాంతఃపురానికి రథంలో వెళతాను. ఒక్కో రాత్రి అక్కడే వుండిపోతాను కూడా. నేను కొరడా రథంలో వుంచి వెళితే, రాత్రికి ఉండనన్న మాట. అప్పుడు సారథి నా కోసం వేచి ఉంటాడు. కొరడా తీసుకుని వెళ్ళానంటే సారథి రథం తోలుకుపోయి, మర్నాడు ఉదయం తిరిగి తెస్తాడు. ఒక రోజు కొరడా రథంలోనే వదిలి రాజాంతఃపురం ప్రవేశించాను. అయితే ఇంతలో

వాన ప్రారంభమయింది. రాజుగారైన మా అన్నగారు నన్ను వెళ్ళనివ్వలేదు. ఆ రాత్రి అక్కడే వుండి పోయాను. వానకు తడుస్తూ, నా సారథి కూడా రథంలోనే ఉండిపోయాడు. అతన్ని ఆ విధంగా ఇబ్బంది పెట్టి నేను ధర్మాన్ని తప్పాను,'' అన్నాడతను.

కనీసం రాజపురోహితుడైనా తమ కోరిక నెరవేర్చుతాడని కళింగ మంత్రులు ఆయన వద్దకు వెళ్ళారు. కాని ఆయన కూడా ధర్మం తప్పినట్టు చెప్పాడు:

''ఒక రోజు నేను రాజభవనానికి పోతుంటే దారిలో ఒక రథం కనిపించింది. దానికి బంగారు తొడుగువున్నది. అది చూడగానే నాకు లోభం కలిగి, రాజుగారు దాన్ని నాకు దానం చేస్తే బాగుండుననిపించింది. నేను తీరా వెళ్ళే సరికి రాజుగారు, 'ఈ రథం మీరు తీసుకోండి,' అన్నాడు. వెంటనే నా లోభం జ్ఞప్తికి వచ్చి, పశ్చాత్తాపంతో రథాన్ని వద్దన్నాను. మీకు ధర్మాలు రాసి పెట్టగల వాణ్ణి కాను!''

కళింగ మంత్రులకేమీ పాలుపోలేదు. వారు చివరి ఆశ మంత్రిమీద పెట్టుకుని ఆయన వద్దకు వెళ్ళారు. కాని ఆయన కూడా వారికి ఆశాభంగం కలిగించాడు.

''ఒకనాడు నేను ఒక రైతు తాలూకు పొలం కొలతలు వేయబోయాను. కొలత ప్రకారం కర్ర పాతవలసిన చోట చిన్న బిలం ఉన్నది. అందులో ఏ ప్రాణి అయినా వుండవచ్చునని అనుమానం వేసింది. కాని కర్ర కొంచెం ఇవతల పాతితే రైతుకు నష్టం, అవతలికి పాతితే రాజుకు నష్టం. అందుచేత ఆ బిలంలోనే కర్ర పాతమని అజ్ఞాపించాను. అదే సమయానికి ఎండ్రకాయ ఒకటి బిలంలో నుంచి బయటికి వస్తూ కర్రపోటుకు చచ్చి పోయింది. అందుచేత నేను కూడా ధర్మం తప్పినవాణ్ణే.''

కళింగ మంత్రులకు ఒక ఆలోచన తట్టింది. వారు తాము విన్న కథలన్నీ బంగారు రేకులపై రాసి, వాటిని తీసుకుపోయి తమ రాజుకు వినిపించారు. ధర్మం పట్ల శ్రద్ధగా ఉండటమే ఉత్తమ ధర్మమని కాళింగుడు తెలుసుకుని, ఆత్మవిమర్శనతో పరిపాలన సాగించాడు. వెంటనే వానలు కురిసి క్షామం తొలగి పోయింది. కళింగ ప్రజలు సుఖంగా జీవించారు.





# కృతజ్ఞత

సీతానగరం గ్రామంలో సీతయ్య, కాశయ్య అనే మిత్రులు ఉండేవారు. ఒకే వూరిలో పుట్టారు. పెరిగారు. వారు చిన్న నాటి నుండి కలిసే చదివారు. సీతయ్య తండ్రి రైతు. ఉన్న అయిదు ఎకరాల పొలం సాగుచేసుకుంటూ పిల్లలను పోషించుకునేవాడు. ఉన్నదాంట్లోనే తృప్తిగా జీవించేవారు. సీతయ్యకు చిన్నప్పటి నుండి పరులకు సాయపడే గుణం అలవడింది.

కాశయ్య తండ్రి వ్యాపారి. అదే వూరిలో దుకాణం పెట్టి వ్యాపారం చేసేవాడు. పిసినారితనంతో మెలిగేవాడు. కాశయ్య తండ్రి చేసే వ్యాపారాన్ని తన వృత్తిగా కొనసాగించాడు. అతడు పిసినారితనంతో మెలగకపోయినా ఎవరికీ సాయపడేవాడు కాదు. దుకాణంలో ఎవరు బ్రతిమిలాడినా సరే అరువు ఇచ్చేవాడు కాదు.

కాశయ్యకి మాత్రం ఏ అవసరం వచ్చినా మిత్రుడు సీతయ్య వద్దకు వెళ్ళి చెప్పుకునేవాడు. సీతయ్య తన మిత్రుడిని అప్యాయంగా పలకరించి అవసరాలు తీర్చేవాడు.

ఒకసారి కాశయ్య కుమార్తె గర్భవతిగా ఉండి పురుటి నొప్పులు పడుతుంటే మంత్రసానికి చూపించాడు. ఆమె పరీక్షలు చేసి బిడ్డ అడ్డం తిరిగిందని వెంటనే పొరుగూరి వైద్యుడికి చూపించమని సలహా ఇచ్చింది. కాశయ్య గభాలున సీతయ్యను కలిసి తన కుమార్తెను వైద్యుడి దగ్గరకుఎడ్ల బండి మీద దిగబెట్టమని కోరాడు.

ఆ సమయానికి సీతయ్య వరి చేను బండి మీద కల్లానికి వెళుతున్నాడు. అయినా సరే మిత్రుడి కుమార్తెను రక్షించడమే ముఖ్యంగా

నారంశెట్టి ఉమామహేశ్వరరావు

భావించాడు. చేను మడిలోనే వదిలేసి బండి మీద ఆమెను వైద్యుడి దగ్గరకి చేర్చాడు. దాంతో తల్లీ పిల్లా క్షేమంగా బయట పడ్డారు. కాశయ్య ఆనం దానికి అంతులేదు. అయినా మాట వరసకి కూడా కృతజ్ఞతలు చెప్పలేదు.

మరోసారి కాశయ్య కొడుక్కి సుస్తీ చేస్తే కొన్ని ఆకు పసరులు, మూలి కలు అవసరమయ్యాయి. వెంటనే అతడికి సీతయ్య గుర్తొచ్చాడు. సీతయ్య పొలంలో ఎప్పుడూ తిరుగు తుంటాడు కనుక అతనికి వాటి గురించి బాగా తెలుసు. అందుకని వెంటనే సీతయ్య ఇంటికి వెళ్ళి తన అవసరాన్ని చెప్పి సహాయం చెయ్య మని కోరాడు. అప్పుడు కూడసీతయ్య పొలంలో చేనుకి తెగులు పట్టిందని పురుగు మందు కొనేందుకు పట్టణం బయల్దేరాడు. మిత్రుడి అవసరం కన్నా గొప్పది కాదు తన పని అని భావించి తన పని మరునాటికి వాయిదా వేసి మిత్రుడి అవసరం తీర్చి ఆదుకున్నాడు. అప్పుడు కూడా మాటవరసకి కూడా కృతజ్ఞతలు చెప్పలేదు.

కొన్నాళ్ళ తరువాత సీతయ్య కొడుక్కి పట్టణంలో నగల వర్తకుడి దగ్గర ఉద్యోగం దొరికింది. అయితే నగల వ్యాపారి ఉద్యోగంలో చేర్చుకునే ముందు పాతిక వేలు రూపాయలు నగదు హామీగా పెట్టాలని షరతు



విధించాడు. అంత డబ్బు సీతయ్య వద్ద సమయానికి లేదు. ఇంకా నూర్పులు కాలేదు..ధాన్యం అమ్మితే డబ్బు వస్తుంది. కాని తన కొడుకు పనిలో చేరేందుకు వారం రోజులే గడువు ఇచ్చాడు.

బాగా ఆలోచించిన సీతయ్యకు తన మిత్రుడు కాశయ్య గుర్తుకు వచ్చాడు. చాలాసార్లు అతని అవసరా లను తీర్చాననే విశ్వాసంతో మిత్రు డిని సాయం కోరేందుకు వెళ్ళాడు . తన పని చెప్పి కొన్నాళ్ళు తర్వాత తీర్చేందుకు అప్పు ఇమ్మని అడి గాడు.

దానికి కాశయ్య 'అయ్యయ్యో సమయానికి నా దగ్గర కూడ డబ్బు లేదు. పోనీ పట్టణంలో యెవరినైనా అప్పు అడుగుదామంటే తనఖాగా

ఏదైనా బంగారు అభరణం పెడితే గానీ అప్పు ఇవ్వరు. మరి నీ వద్ద ఏదైనా నగ వుంటే తీసుకురాకూడదా?' అని అడిగాడు.

సీతయ్య చేసేది లేక తన బంధువుల వద్ద అప్పు తీసుకొని కొడుకుని పట్టణంలో పనిలో చేర్పించాడు. అయితే అతడి మనసులో కాశయ్య ప్రవర్తించిన తీరు బాధిస్తూనే ఉండేది.

మరికొద్ది రోజులకి వారిద్దరికి చిన్ననాటి స్నేహితుడు అయిన వీరయ్య కలిసాడు. మాటల మధ్యలో కాశయ్య ప్రస్తావన తెచ్చి 'ఎలా ఉన్నాడు మన చిన్ననాటి నేస్తం. యేమైనా మారాడా? లేక అలాగే ఉన్నాడా?' అని ప్రశ్నించాడు. దానికి సీతయ్య తన అనుభవాలు వివరించి 'నాకు సాయం చేయక పోతే పోయాడు. కనీసం మేలు పొందిన రోజు కూడా కృతజ్ఞతలు చెప్పేవాడు కాదు. అందుకు ఇంకా బాధగా ఉందిరా.' అని విచారం వ్యక్తం చేశాడు.

దానికి వీరయ్య ఫకాలున నవ్వాడు. 'కృతజ్ఞత అనేది చెప్పాల్సిన వాడి తల మీదున్న బరువు. చెప్పలేదని బాధపడుతూ ఆ బరువుని నీ తల మీదకు ఎత్తుకోవాలని చూస్తావెందుకు? నీవు రైతు బిడ్డవు. నీ వృత్తి వ్యవసాయం. అంటే నీ పని లోనే సాయం అనే పదాన్ని తగిలించుకున్నవాడివి. నీ సహజగుణం పరులకు సాయపడడం. అందువల్ల నీవు ఉదారంగా సహాయం చేశావు. ఇక ముందు కూడ ఇలాగే సహాయం చేయి. ఏమీ ఆశించకు. అతడు వ్యాపారి బిడ్డ. అతడు అందరితో లాభం చూసే ప్రవర్తిస్తాడు. అతడి సహజ గుణం అతడు చూపించుకున్నాడు. అంతే మీ ఇద్దరి మధ్య తేడా' అని వివరంగా చెప్పగానే సీతయ్య కూడా గట్టిగా నవ్వేశాడు.

ఆ తర్వాత సీతయ్య ఎవరికి సాయం చేసినా సరే కృతజ్ఞత ఆశించే వాడు కాదు.



# బాధ ఒక్కటే!

గంగాధరం అనే కూరగాయల వ్యాపారి దగ్గర, సత్యరాజనేయువకుడు కొత్తగా పనిలో చేరాడు. సత్యరాజు ఎంతోనిజాయితీగా పనిచేస్తూ, యజమాని మెప్పుపొందాడు. అయితే, సత్యరాజుకు కాస్తకోపం ఎక్కువ. కూరగాయలు కొనడానికి వచ్చినవాళ్ళు బేరమాడుతూ విసిగిస్తే, "వెళ్ళండి, వెళ్ళండి! మీరేంకొంటారు," అంటూ కసురుకునేవాడు. కొనడానికి వచ్చినవాళ్ళను ఇలా కసురుకోవడం కోప్పడడంలాంటివి మానుకోమని, గంగాధరం ఎంతగానో చెప్పిచూశాడు. కానీ, సత్యరాజు ఇవేమీ వినిపించుకోలేదు.

ఒకరోజు, ఆ ఊరిపెద్ద వీరభద్రయ్య పనిమనిషి మీద సత్యరాజు దురుసుగా మాట్లాడడంతో, వీరభద్రయ్య స్వయంగా వచ్చి గంగాధరాన్ని నానా మాటలూ అనిపోయాడు. ఇక ఊరుకుని లాభంలేదని గంగాధరం, సత్యరాజును పనిలోంచి తీసివేశాడు. దిగాలుపడిపోయిన సత్యరాజు రెండురోజుల తర్వాత తిరిగి గంగాధరం వద్దకు వచ్చి, తనను పనిలోకి తీసుకోమని బతిమాలడం మొదలు పెట్టాడు. అయితే, గంగాధరం, అతడు చెప్పేది వినిపించుకోకుండా, "ఏయ్, చెప్తుంటే మనిషివికాదూ వెళ్ళు, పో!" అంటూ అరిచాడు. గంగాధరం తనను కుక్కను అదిలించినట్లుగా కరకుగా మాట్లాడడంతో, సత్యరాజు మనసు కలుక్కుమన్నది. అతడు కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూండగా తలదించుకుని వెనక్కు తిరిగాడు. వెంటనే గంగాధరం అతణ్ణి, "ఒరేయ్, ఇలారా!" అంటూ పిలిచాడు.

సత్యరాజు వెనక్కువచ్చి యజమాని ఎదురుగా నిలబడ్డాడు. అప్పుడు గంగాధరం, "ఇప్పుడు నీకు అర్థమయిందా? ఒక మనిషితో మరొకమనిషి మర్యాదగా, గౌరవంగా మాట్లాడకుండా కసురుకుంటే, ఆ మనిషి ఎంతగా బాధపడతాడో!" అన్నాడు సౌమ్యంగా.

నిజంగానే సత్యరాజుకు ఆ బాధ అనుభవంలోకివచ్చింది. చేతులుజోడిస్తూ, "ఆ బాధ ఎలావుంటుందో తెలిసివచ్చింది, బాబూ!" అన్నాడు. "ఇప్పుడు నేను, నిన్ను నమ్మగలను. వెంటనే పనిలో చేరు," అన్నాడు గంగాధరం శాంతంగా.

– కె. లక్ష్మీ కాంతమ్మ





# పంచతంత్ర కథలు

అది మొదలు కాకీ, ఎలుకా రోజూ కలుసుకుని, చర్చలతో మహా సంతోషంగా కాలం గడుపుతూ వచ్చాయి. అవి పరస్పరం సహకరించేవి కూడా. యజ్ఞాలు చేసిన చోట మిగిలిపోయిన మాంసమూ, అన్నం మెతుకులూ తెచ్చి కాకి ఎలుకకు ఇచ్చేది. అలాగే ఎలుక, తాను రాత్రి వేళ సేకరించిన బియ్యమూ, ఇతర తినుబండారాలూ కాకికి పెట్టేది.

ఇలాటి ఇచ్చి పుచ్చుకోవటాలతో రెంటి మధ్యా మైత్రి దృఢమయింది. ఇచ్చి పుచ్చుకోవటాలు లేని స్నేహమంటూ ఉండదు గదా! దేవతలు సైతం మొక్కులు చెల్లిస్తేనే గాని కోరికలు తీర్చరు. ఇవ్వటం ఉన్నంత కాలమే మమకారం ఉంటుంది.

తల్లి దగ్గిర పాలు రావటం నిలిచిపోగానే దూడ తల్లిని వదిలేస్తుంది. అలా కాకుండా, ఇవ్వడం ద్వారా శత్రువును మిత్రుడుగా చేసుకోవచ్చు. జంతు జాతిలో ఇచ్చే గుణం కడుపుతీపి కన్న హెచ్చయినది. గేదె తన దూడ ఉండగానే, తన పాలను ఎలాటి దుర్మార్గుడికైనా ఇచ్చేస్తుంది. సహజశత్రువులై ఉండి కూడా. ఎలుకా, కాకీ దృఢ స్నేహంలో బంధించబడిపోయి, సరదాగా చర్చలు జరుపుకుంటూ వచ్చాయి.

అంతలో ఒకనాడు, కాకి ఎలుక వద్దకు వచ్చి, కన్నీరు పెట్టుకుంటూ, గద్గద స్వరంతో, 'ఓ హిరణ్యకా, మనకు త్వరలోనే ఎడబాటు రానున్నది. నేను ఈ దేశం విడిచి పోవలసి వచ్చింది,' అన్నది.

'ఏం' అని ఆశ్చర్యపోతూ హిరణ్యకం అడిగింది. 'దేశంలో భయంకరమైన నీటి కరువు ఏర్పడింది. ప్రజలు మాడి

మిత్ర సంప్రాప్తి – 4

పోతున్నారు. యజ్ఞాలు నిలిచిపోయాయి. వాటి మూలానే నాకు మంచి ఆహారం దొరికేది. ప్రజలు ఆకలి బాధకు తట్టుకోలేక అడ్డమైన పక్షులన్నిటినీ పట్టుకుని తింటున్నారు. ఏ ఇంట చూసినా పట్టుబడిన దౌర్భాగ్యపు పక్షులే కనబడుతున్నాయి. వాటిని చూస్తే నా గుండె తరుక్కుపోతున్నది. నేను కూడా పట్టుబడి, ఎలాగో ప్రాణాలతో తప్పించుకున్నాను. అందుకే నేను వెంటనే దేశం విడిచి వెళ్లనిశ్చయించాను.' అన్నది కాకి.

'ఎక్కడికి పోదామనుకుంటున్నావు?' అని ఎలుక అడిగింది.

'దక్షిణ దేశంలో ఒక మహారణ్యం మధ్య ఒక పెద్ద సరస్సు ఉన్నది. అక్కడ నాకు నీ కన్న కూడా ఆత్మీయుడైన స్నేహితుడు మంధరకం అనే తాబేలు ఉన్నది. అది నాకు చేప మాంసం ఇస్తుంది. ఆ మాంసం తింటూ, దానితో గోష్ఠి జరుపుతూ సుఖంగా ఉంటాను. ఇక్కడే ఉండి, పక్షిజాతి బంధించబడటమూ, చావటమూ చూడలేదు. ప్రయాణం దుర్ఘటం కాదా, అంత దూరప్రాంతానికి వెళ్లడం వాంఛనీయమా అని నవు అడగవచ్చు. కాని సమర్థులకు చేయరానిది, పట్టుదల ఉంటే సాధించరానిదీ, జ్ఞానవంతుడికి పరదేశమూ, సాధుగా మాట్లాడే వాడికి విజాతీయుడూ అంటూ ఉండదు



గదా! దేశం కరువు వాతపడి పంటలు మాడిపోతూ ఉన్నప్పుడు, తమ కుటుంబాలు నాశనం కావటమూ చూడకుండా ముందుగా దాటిపోయే వాళ్ళు ధన్యులు,' అన్నది కాకి.

'అలా అయితే, నేను కూడా వస్తాను. ఇక్కడే ఉండిపోవడం నాకూ క్షేమం కాదు,' అన్నది ఎలుక.

'ఎందుచేత?' అని కాకి అడిగింది.

'అది పెద్ద కథలే. మనం సరస్సు చేరుకున్నాక చెబుతాను,' అన్నది ఎలుక.

'నేను ఆకాశంలో ఎగిరే పక్షిని. నువు నేలను అంటిపెట్టుకుని ఉండే ప్రాణివి. మనం కలిసి ఎలా ప్రయాణించగలం?' అని కాకి అడిగింది.

'నువు నా ప్రాణాన్ని కాపాడదలు

చుకుంటే, నన్ను నీ వీపు మీద ఎక్కిం చుకుని సరస్సు వద్దకు ఎగిరి వెళ్లు. అంత కన్న మార్గం లేదు,' అన్నది ఎలుక.

'సంతోషంగా ఆ పని చేస్తాను. నా అదృష్టం! ఇద్దరు స్నేహితులతో నాకు సరస్సు వద్ద మరింత ఆనందంగా కాల క్షేపమవుతుంది' అన్నది కాకి.

హిరణ్యకం కాకి వీపు మీదికి ఎక్కింది. కాకి తొట్రుపడకుండా, అతి తేలికగా సరస్సు వద్దకు ఎగిరివెళ్లింది.

మంధరకం బహు జాగరూకత గల ప్రాణి. అది, ఎలుకను వీపు మీద ఎక్కించుకుని వస్తున్న కాకిని చూసి, 'ఇదేదో వింత కాకిలాగున్నది. మనం తప్పుకుందాం,' అనుకుని నీటిలో మునిగింది.

కాకి ఎలుకను ఒక చెట్టు కింది కలుగు దగ్గిర దించి, చెట్టుకొమ్మ చివరన వాలి, 'మంధరకా, త్వరగా రా, నేను నీ మిత్రుడిని, లఘుపతనకాన్ని. ఆర్తితో వచ్చాను. అందుచేత వచ్చి నన్ను కౌగలించుకో,' అని గట్టిగా కేక పెట్టింది.

తాబేలు ఆనందబాష్పాలు రాల్చుచూ, వేగంగా కొట్టుకుంటున్న గుండెతో ఒడ్డుకు వచ్చి, 'మిత్రమా, నీ కౌగిలి ఇయ్యి, మనం కలుసుకుని ఎంతో కాలం కావటం వల్లా, నువు చాలా మారిపోయి ఉండటం వల్లా నిన్ను పోల్చలేకపోయాను. అందుకే నీటిలో దాక్కున్నాను,' అన్నది.

కాకి చెట్టు మీది నుంచి కిందికి దిగి తాబేలును కౌగలించుకున్నది. చాలా కాలానికి తిరిగి కలుసుకున్న మిత్రులు మధ్యకాలంలో కలిగిన తమ అనుభవాలను గురించి ముచ్చటించుకుంటూంటే ఎలుక వచ్చి తాబేలుకు సాష్టాంగ నమస్కారం చేసి, కాకి సమీపంలో కూర్చున్నది. (ఇంకా వుంది)





# సజీవశిల్పాలు

తండ్రి మరణానంతరం యువకుడైన రాజేంద్రవర్మ శంభుపురానికి రాజయ్యాడు. తాతగారైన జ్ఞానవర్మ, తండ్రిగారైన వివేక వర్మ అడుగు జాడల్లోనే నడుస్తూ, ప్రజా సంక్షేమానికి పెద్ద పీట వేసి అందరి మన్ననలకూ పాత్రుడయ్యాడు.

ఇదిలా ఉండగా, పొరుగు రాజు దేవేంద్రుడు యుద్ధానికి కాలు దువ్వుతున్నాడని చారుల ద్వారా విన్న రాజేంద్రవర్మ కదనానికి బయలు దేరి వెళ్లాడు. తన సైనిక బలం, సర్వసేనాధిపతి యుక్తి వల్ల విజయం సునాయాసంగానే దరిజేరింది. దేవేంద్రుడు తనకు తాను సామంత రాజుగా ప్రకటించుకుని, కప్పం చెల్లించడానికి అంగీకరించాడు.

తిరుగు ప్రయాణంలో నగరం నడిబొడ్డున దేవేంద్రుని శిలావిగ్రహం రాజేంద్ర వర్మ కంటబడింది. అతగాడూ ప్రజాశ్రేయస్సే పరమావధిగా పరిపాలన కొనసాగిస్తున్నాడని ప్రజల ద్వారా విన్నాడు.

రాజేంద్రవర్మ తనలో తాను ఇలాగనుకున్నాడు. 'రాజ్యం ఇప్పుడు పూర్తిగా నా అధీనంలో ఉంది. దేవేంద్రుని విగ్రహస్థానంలో నా విగ్రహం నెలకొల్పాలి. అదే సరైన పని!' అని అనుకుని, ఆ విగ్రహాన్ని నిట్టనిలువునా కూల్చివేయించి, శంభుపురానికి చేరాడు రాజేంద్రవర్మ.

ఒక రోజు తన రహస్య మందిరంలోనికి మంత్రి దండనాథుడిని పిలిపించాడు రాజేంద్ర వర్మ. ''మంత్రివర్యా! మన రాజ్యంలో పూర్వ రాజుల శిలావిగ్రహాలు ఎందుకు ఏర్పాటు చెయ్యలేదు. శిల్పులతో నా శిలావిగ్రహాలు మూడు చెక్కించి మన రాజ్యంలో రెండు, మన సామంత రాజ్యంలో ఒకటి నిలువబెట్టే ఏర్పాటు చేయండి. రాజ్యంలో నా స్థానం సుస్థిరంగా ఉండాలి. ఇది నా ఆజ్ఞ! అని ఆదేశించాడు రాజేంద్రవర్మ.

శిల్పాలు నిలబెట్టడం ఇంతవరకూ రాజ్యంలో లేని సంప్రదాయం. దండనాథుడికి ఇష్టం లేకపోయినా, శిల్పులకు

జి.జాన్ కెనడీ

కబురు పంపి, మూడు శిలా ప్రతిమలను తయారు చేయమని పురమాయించాడు. శిల్పాలను ప్రతిష్ఠించేరోజు రానే వచ్చింది. నగరం నడిబొడ్డున వేదిక ఏర్పాటు చేయబడింది. మహారాజు రాజేంద్రవర్మ కూడా విచ్చేశాడు.

మహారాజును చూడగానే ప్రజలలో ఆనంద సంతోషాలు మిన్నంటాయి. తప్పెట్లు, తాళాలు, నాట్యాలతో తమ సంబరాన్ని వ్యక్తపరిచారు.

ప్రజల పొగడ్తలు వింటున్న రాజేంద్రవర్మ పొంగిపోయాడు. దండనాథుడి ఆజ్ఞతో, మూడు విగ్రహాల మీద ఉన్న ముసుగులు తొలగించబడ్డాయి. వాటిని చూసిన రాజేంద్రవర్మ విస్తుపోయాడు. ఎందుకంటే, అవి శిలాప్రతిమలు కాదు. మూడు నున్నని నిలువెత్తు రాళ్లు. అవమానంగా భావించిన మహారాజు, ముగ్గురు శిల్పులనూ బంధించమన్నాడు.

దండనాథుడు జోక్యం చేసుకుని, 'శాంతించండి మహారాజా, ప్రజారంజకంగా పరిపాలించే రాజు శిల్పానికి ఏగతి పట్టిందో మీరే ఎరుగుదురు! అని పొరుగురాజు దేవేంద్రుడి శిలావిగ్రహాన్ని రాజేంద్రవర్మ స్వయంగా తానే ధ్వంసం చేయించిన సంగతిని గుర్తు చేశాడు.

రాజేంద్రవర్మ మంత్రివర్యుల వంక అయోమయంగా చూశాడు. మీరు అమలు చేస్తున్న ప్రజాసంక్షేమంతో పూర్తి సుఖ సంతోషాలను అనుభవిస్తున్న ప్రజలంతా మన పక్షాన నిలబడుతున్నారు. ప్రజా సంక్షేమం కోరే మహారాజు మంచితనం, గొప్పతనం ఒక శిలలో ఇమడలేవు. అవి ప్రజల మనసుల్లోనే చిరస్థాయిగా నిలబడగలవు. భావితరాల వారికి అవి ప్రత్యేక పాఠాలుగా విశదీకరించబడగలవు. ప్రజల మనసుల్లో పేరు ప్రతిష్ఠలు ఏ స్థాయిలో ముద్రించుకుపోయాయో, మీ చెవులలో మీరే విన్నారుగా. మీ ఎదురుగా మీ గొప్పతనాన్ని గుర్తు చేసే ఇన్ని సజీవ శిల్పాలుండగా నిర్జీవ శిల్పం మీద మీకెందుకు అంత మమకారం! అని వివరించాడు దండనాథుడు. రాజేంద్రవర్మ సంతోషపడి, తన అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు. ఆనాటినుండి మరింత ప్రజారంజకంగా పరిపాలించాడు. అందరినుండి మరిన్ని మన్ననలు మూటగట్టుకున్నాడు.



# వంకరబుద్ధి

జగన్నాథం దంపతులకు ఒకర్తే కూతురు! రామవరం సంబంధం మంచిదని విని ఘనంగా కూతురి పెళ్ళి చేశారు. పెళ్ళి తరవాత ఒక రోజు వారు విందు పెడితే వియ్యాలవారు వంటకాలు రుచికరంగా లేవని పెదవి విరిచి ముఖం ఎదుటే చెప్పారు.

మరొకమారు వియ్యాలవారు వచ్చినప్పుడు జగన్నాథం దంపతులు జాగ్రత్తపడ్డారు. ఊరిలో పేరు పడ్డ వంటలక్కను పిలిచి వండించారు. వీరకాడు, వీరకత్తె భోజనం సుష్టుగా తిని వెళ్ళి తమ ఇంటివద్ద కోడలితో 'మీ వాళ్ల వంటలు ఈసారి బాగానే ఉన్నాయి కాని అన్నీ కొలత ప్రకారమే పెట్టారు,' అని వంక పెట్టారు.

కూతురి ద్వారా వియ్యాలవారి మనసు తెలుసుకున్న జగన్నాథం దంపతులు మరొకసారి వారు వచ్చినప్పుడు మాట రాకుండా విందు ఏర్పాటు చెయ్యాలనుకున్నారు. ఒక పండుగ సందర్భంగా ఆ నెలలోనే వియ్యాల వారు వచ్చారు.

జగన్నాథం దంపతులు. వంటకాలన్నీ సిద్ధమయ్యాక వీరకాడు వీరకత్తెలను భోజనానికి పిలిచి, 'మీకిష్టమైనవి మీ కోడలి ద్వారా తెలుసుకున్నాం. మొగమాట పడకుండా తినండి.' అని వెండి కంచాలు వెండిగిన్నెలలో అన్నం అమర్చి అక్కడ తాముంటే తినడానికి మొగమాటపడతారని అక్కడ నుండి ఏదో పని ఉన్నట్లు బయటకు వెళ్ళిపోయారు. బాగా తిని వెళ్ళిన వియ్యాలవారు అక్కడ కోడలితో 'అన్నీ బాగున్నాయి కాని భోజనం చేసే వెండి కంచాలు, వెండి గిన్నెలు చిన్నవి పెట్టారు. తినేటప్పుడు మాకది ఇబ్బందనిపించింది,' అని వారి అసంతృప్తిని వెలిబుచ్చారు.

జగన్నాథం దంపతులకు కూతురి ద్వారా విషయం తెలిసింది. 'వంకబెట్టే మనుషులను ఎవరూ తృప్తి పరచలేరు. అందుకే పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకలతో కాని పోదంటారు. పట్టించుకుంటే మనమే పిచ్చివారమవుతాం,' అని చెప్పి నవ్వుకున్నారు.

– బి. భీమేశ్వరరావు





# అప్పులు తీర్చిన పరిష్కారం

సంజీవయ్యది సాధారణ కుటుంబం. ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రమే. అయినా దగ్గర బంధువులను అభిమానంతో చూసేవాడు. ఇంటికి వచ్చిన వారికి మర్యాదలో లోటు చేసేవాడు కాడు. కాబట్టి ఎప్పుడూ ఇల్లు కలకలలాడేది. బంధువల తాకిడితో ఆర్థిక పరిస్థితి వెలవెల పోసాగింది. బంధువుల తాకిడి తగ్గించుకునేదెలా అని ఆలోచిస్తుంటే మిత్రుడు, చక్కని సలహాదారు అయిన సులోచనయ్య గుర్తుకు రావటంతో వెంటనే అతని వద్దకు వెళ్లి తన ఇంటి వివరాలు, ఇబ్బందులు, బంధువుల గురించి తెలియ చేశాడు.

అంతా విన్న సులోచనయ్య, 'అయితే బంధువులు మీ ఇంటికి రావడం తగ్గించాలి అంతే కదా,' అన్నాడు. 'అలాగని బంధువులను దూరం చేసుకోవడం కాదు. ఎవరిని నొప్పించకుండా పరిస్థితిని చక్కపెట్టాలి,' అని అన్నాడు సంజీవయ్య.

సులోచనయ్య ఆలోచిస్తూ, 'నీవు బాగా అభిమానిస్తున్నావు, ఆదరిస్తున్నావు కనుకనే వస్తున్నారు, వారి అలవాట్లు, అవసరాలను ఏమైనా గమనించావా? వారి ఆర్థిక పరిస్థితి ఎలా ఉంటుంది?' అని అడిగాడు. 'కొందరు ఆర్థికంగా బాగున్నారు, కొందరి పరిస్థితి అంత మాత్రమే, అయితే మా బంధువులలో ఉన్నవారి దగ్గరనుండి, లేనివారు కొన్ని సందర్భాలలో అప్పు తీసుకోవడం గమనించాను,' అని సంజీవయ్య చెప్పడంతో 'సరే, నీ సమస్యకు పరిష్కారం దొరికినట్లే, అయితే నేను చెప్పినట్లు నువ్వు చెయ్యాలి. ఇక ముందు, బంధువులు అప్పులు ఇవ్వడం కాని, తీసుకోవడం కాని నీ చేతుల మీదుగా జరిగేటట్టు చూడు,' అన్నాడు సులోచనయ్య. 'అయ్యో,

సి. నాగేశ్వరరావు

మధ్యలో నాకెందుకు, తర్వాత ఇబ్బంది పడతాను అప్పు తీర్చని వారుంటే,' అన్నాడు సంజీవయ్య.

'నామీద నమ్మకం ఉంటే, నేను చెప్పినట్లు చెయ్యి,' అని అనడంతో, 'సరే' అన్నాడు సంజీవయ్య. 'బంధువులకు, అప్పు ఇవ్వమని, డబ్బున్న వారినుండి తీసుకుని, అవసరమైన వారందరికీ నీ చేతుల మీదుగా ఇప్పించు, నెల రోజుల తర్వాత కనిపించు,' అన్నాడు సులోచనయ్య.

నెల తర్వాత సంజీవయ్య వచ్చి, 'నువ్వు చెప్పినట్లే, అప్పులిప్పించాను. ఇప్పుడు అప్పు తీసుకున్నవారు రావడం మానేశారు. కాని అప్పులిచ్చిన వారు వస్తున్నారు,' అని వివరించాడు.

'సరే, ఇప్పుడు అప్పు ఇచ్చిన వారు వచ్చినప్పుడు మరి కొంత మంది మన బంధువులు, ఆర్థిక ఇబ్బందులలో ఉన్నారు. వారికి అప్పిచ్చి అవసరాలను మీరే తీర్చాలి, అని ప్రాధేయ పడు, వచ్చినప్పుడల్లా ఇదే పని చేస్తూ, పదిరోజుల తర్వాత కన్పించు,' అని చెప్పి పంపాడు సులోచనయ్య.

సులోచనయ్య సలహాను పాటించి పదిరోజుల తర్వాత వచ్చి, 'నువు చెప్పినట్లే చేశాను. ఇప్పుడు, అప్పు తీసుకున్నవారు. అప్పు ఇచ్చిన వారు కూడా పూర్తిగా రావడం మానేశారు. నా సమస్యకు పరిష్కారం దొరికింది. కానీ ఎందుకు రావడం మానేశారో అర్థం కాలేదు,' అన్నాడు సంజీవయ్య.

'ఇందులో అర్థం కాకపోవడానికి ఏముంది. అప్పు తీసుకున్న వారు నీ చేతులమీదుగా తీసుకున్నారు గనుక, నువు తీర్చమంటావని కన్పించడం మానేశారు. అప్పులిచ్చిన బంధువులు వసూలు మాట అటుంచి, నువ్వు కొత్తగా అప్పులు ఎక్కడ అడుగుతావోనని కన్పించడం మానేశారు.' అని నవ్వుతూ సమాధాన మిచ్చాడు సులోచనయ్య.

'ఎలాగైతేనేమి, మా ఇంటికి బంధువుల తాకిడి తగ్గింది. అదే సంతోషం.' అని సంజీవయ్య అంటే 'అప్పులు తీర్చిన పరిష్కారం ఇది,' అని సులోచనయ్య అన్నాడు.





# జాలిగుణం

పోలవరం అనే గ్రామంలో పోలయ్య అనే వర్తకుడుండేవాడు. అతడికి మురారి అని ఒక్కడే కొడుకు. వాడిలో చిన్నతనం నుంచే జాలిగుణం ఎక్కువగా వుండేది. వాడిప్పుడు పదేళ్ళవయసువాడయ్యాడు.

ఒకరోజున మురారి వీధిలోకి ఆడుకునేందుకు వెళ్ళి, ఒంటి మీద చొక్కాలేకుండా తిరిగివచ్చాడు. జరిగిందేమంటే – వాడితో ఆడుకుంటున్నవాడి స్నేహితుడికి చొక్కా చిరిగి పోయింది. వాడు పేదవాడు. ఉన్న ఒక్క చొక్కా చిరిగి పోయిందనీ, రేపటి నుంచి చొక్కాలేకుండా తిరిగాలనీ, వాడు ఏడవసాగాడు. అందుచేత, మురారి తన చొక్కా వాడికి దానం చేశాడు.

ఇది విని పోలయ్య, మురారిని బాగా తిట్టాడు. వ్యాపారగుణానికి జాలి పనికిరాదనీ, పద్ధతి మార్చుకోమనీ కొట్టబోయాడు. పోలయ్య భార్య అడ్డుపడి, "వాడిని తిట్టీ కొట్టీ ప్రయోజనం లేదు. మనం వర్తకులం. దానగుణంవుండడం మేలో కీడోగాని, జాలిగుణం ముదిరితే మాత్రం వీడు వ్యాపారంలో నష్టపోతాడు. వాడిని తగిన గురువు వద్ద చదివించి, వాడిలో వివేకాన్ని మేల్కొల్పే ప్రయత్నం చేయండి," అన్నది.

భార్య సలహా నచ్చిన పోలయ్య, మురారిని వెంటబెట్టుకుని సుశర్మ ఇంటికి వెళ్ళాడు. సుశర్మ మంచి పండితుడు. పోలయ్య, సుశర్మకు జరిగింది చెప్పి, "పంచతంత్రంలోని విష్ణుశర్మ, రాకుమారులకు జ్ఞానం కలిగించినట్లు, నా కొడుకు మురారికి కూడా మీరే జ్ఞానం కలిగించాలి. వీడు చదివి ఉద్యోగాలు చేసి ఊళ్ళేలనక్కరలేదు. వర్తకుడి కొడుకుగా తయారైతే చాలు. జాలిగుణం లేదా తన్ను మాలినధర్మం, మా వర్తకులకు పనికిరాదని, వీడికి జ్ఞానోదయం కలిగించండి," అన్నాడు.

పోలయ్య చెప్పింది విన్న సుశర్మ చిన్నగా నవ్వి, "పోలయ్యగారూ! మనిషికుండవలసిన ప్రధానమైన మంచి గుణాల్లో జాలిగుణం ఒకటి. సాటి మనిషిపట్ల జాలి

డా. జొన్నలగడ్డ మార్కండేయులు



చూపనివాడు, పాషాణ హృదయుడే తప్ప మనిషి కాడు. అయితే, జాలికి కాస్త అమాయకత్వం, తోడు కాకుండా జాగ్రత్తపడాలి. విచక్షణ చూపాలి!'' అని మురారిని శిష్యుడుగా చేర్చుకున్నాడు.

ఆ రోజు నుంచి మురారి ఉదయం, సాయంత్రం సుశర్మ ఇంటికి వచ్చి విద్య నేర్చుకోసాగాడు. ఒక నాటి ఉదయం సుశర్మ, మురారితో, ''నాయనా! నువ్వు చదువు పట్ల మంచి శ్రద్ధకనబరుస్తున్నావు, అయితే, జాలి చూపించే ముందు, అవతలివాళ్ళు అర్హులో కాదో గ్రహించగలగాలి. వ్యాపారానికి నేర్పు, వాక్చాతుర్యం ముఖ్యం. అందులో జాలిగుణానికి తావు లేదు. ఇది తెలుసుకునినువ్వు ఆలోచించడం మొదలు పెడితే, ఇతరులకు సహాయపడాలన్న నీ సైజగుణం ప్రయోజనకరంగా రూపుదిద్దుకుంటుంది!'' అన్నాడు.

ఆ వెంటనే మురారి, ''గురువుగారూ! నా జాలిగుణానికీ, వ్యాపారానికీ సంబంధమేమిటో అర్థంకాలేదు,'' అన్నాడు.

''అది నీకు త్వరలో అర్థమౌతుంది. సరే, నువ్వొకచిన్న పని చెయ్యాలి. ఇప్పుడు మా తల్లికి వరదాచారిగారు మందులు ఇస్తున్నాడు. నువ్వాయన ఇంటికి వెళ్ళి, నేను పంపించానని చెప్పి, ఆయనిచ్చే మందు తీసుకురా,'' అన్నాడు సుశర్మ.

మురారి, వరదాచారి ఇంటికి వెళ్ళి సంగతి చెప్పాడు. ఆయన, ''మందు తయారు చేయడానికి ఒక గంట పడుతుంది. రోగుల్ని పంపించేశాక, నీ పని చూస్తాను,'' అన్నాడు.

ఆయన మందు కోసం వచ్చిన ప్రతి రోగితోనూ, ''నాకు వైద్యంకోసం మూలికలు తెచ్చి పెట్టే ఒక కుంటివాడున్నాడు. వాడి తండ్రి గుండె జబ్బుతో బాధపడుతున్నాడు. దానికి బంగారం, పాదరసం పుటం పెట్టి, రసరాజగుళికలు తయారుచేసి వాడాలి. నావంతు సాయం నేను చేస్తాను. మీరు జాలితో వాడికి తృణమో పణమో ఇవ్వండి. వాడిప్పుడు బయట నిలబడివున్నాడు,'' అని చెప్పాడు.

వింటూనే మురారి మనసు జాలితో నిండిపోయింది. బయటికి వచ్చి చూశాడు. ఇంటి అరుగు పక్కన ఒకడు కర్ర ఊతంగా పట్టుకుని నిలబడివున్నాడు.

రోగులందరూ వెళ్ళిపోయాక మురారి, వరదాచారి దగ్గరకు వచ్చి, 'అయ్యా, జాలిగుణం కూడదన్న మా గురువుగారి మాటలు నిజమనిపించడంలేదు. ఆ కుంటివాడికి జాలి కొద్దీ చాలా మంది డబ్బులు వేసిపోతున్నారు. నా దగ్గర డబ్బేంలేదు. ఈవేలి ఉంగరం

తమకిస్తున్నాను. ఆ అవిటివాడి తండ్రికి రసగుళికలు తయారు చేయడానికి సాయపడుతుంది!' అన్నాడు.

మురారి మాటలకు, వరదాచారి పెద్దగా నవ్వి, వీధిలోకి తొంగి చూసి, "వీరయ్యా!" అంటూ కేక వేశాడు.

అవిటివాడిలా కర్ర ఊతంతో నిలబడివున్నవాడు చప్పున కర్రను అరుగుమీద పడవేసి, చకచకా నడుస్తూ లోపలికి వచ్చాడు. ఇది చూసి మురారి ఆశ్చర్యపడుతున్నంతలో,వరదాచారి వాడి భుజం తట్టి, "వీణ్ణినేనే ఏర్పాటు చేశాను. మనిషి జాలిగుణాన్ని ఆసరాచేసుకుని, ఎలా సంపాదించవచ్చో నీకర్థమైందనుకుంటాను. నీవేలి ఉంగరం, నీతండ్రి ప్రేమతో నీకిచ్చింది. నీ జాలిగుణం కొద్దీ దాన్ని ఒక మోసగాడికి ఇచ్చెయ్య బోయావు, అవునా?" అని అడిగాడు.

మురారి అవునన్నట్టు తల ఊపాడు. అప్పుడు వరదాచారి, "నా వృత్తి ధర్మం ఒక రోగికి ఉపయోగపడడానికి అప్పుడప్పుడూ, ఒక చిన్న మోసమో, అబద్ధమో ఆడవలసివస్తుంది. నీ గురువుగారి తల్లి సంగతే చూడు! వార్ధక్యంలో వచ్చే సాధారణ శరీరలక్షణాలను, వ్యాధి అనుకుని భయపడుతున్నది. అది వ్యాధికాదని చెబితే ఆమెకు తృప్తికలగదు. అందుచేత, కాస్త బలవర్ధకమైన గుళికలకు లేనిపోని గొప్పగుణాలు ఆపాదించి పంపుతూంటాను. ఆవిడ తృప్తి పడుతుంది. ఇప్పుడు నీకిచ్చిపంప బోయేవి అటువంటి గుళికలే!" అని ఒక పొట్లం మురారి చేతికిచ్చి, "ఇక ముందు నువ్వు వర్తకం మీద అంకితభావం అలవర్చు చేసుకుని, ప్రయోజనకరమైన జాలిగుణంతో కీర్తి తెచ్చుకో. ఆ అవిటివాడి నాటకమంతా, మీ గురువుగారు ఆడించినదే," అన్నాడు.

మురారి మందుగుళికల పొట్లంతో సుశర్మ ఇంటికి తిరిగివచ్చి, దాన్ని ఆయనకిస్తూ, "గురువుగారూ! మనలోని జాలిగుణాన్నిఅనాలోచితంగా అందరి పట్లా కనబరచకూడదని, తెలుసుకున్నాను," అన్నాడు.

మురారిలో వచ్చిన మార్పు, సుశర్మకు చాలా సంతోషం కలిగించింది. నా ప్రయత్నం ఫలించింది. వ్యాపారి పోలయ్య చాలా అదృష్టవంతుడు, అనుకున్నాడాయన.





# సాహసికుడు

పూర్వం ఒకానొక చిన్న [illegible]కంలో ఒక మారుమూల గ్రామంలో రంగరాజు, సోమరాజు అనే ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వాళ్ళిద్దరూ ఒకరి పట్ల ఒకరు ఎంతో అభిమానంగావుంటూ ఒకే ఇంట కలిసివుండేవారు. వారి భార్యలు కూడా తోడికోడళ్ళ కలహాలేమీ లేకుండా కలిసి మెలిసి వుండడం చేత, అన్నదమ్ములిద్దరికీ ఏ బాధా వుండేది కాదు.

ఒకనాటి సాయంత్రం అన్నదమ్ములిద్దరూ తీరిగ్గా అరుగు మీద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ, ఎదుగూ బొదుగూ లేని తమ జీవితాల గురించి తీవ్రమైన విచారంలో పడ్డారు.

‘‘మనం ఈ పల్లెటూళ్ళో ఎన్నాళ్ళు బతికినా, మనబతుకు గొర్రెతోక బెత్తెడే అన్నట్టు వుంటుంది. అంచేత మనం మనకున్నకాస్త పొలం అమ్మేసి, రాజు చంద్రహాసుడి పంచన చేరదాం,’’ అన్నాడు సోమరాజు.

తమ్ముడి మాటలకు రంగరాజు, ‘‘నీ ఆలోచన బాగానే వుంది! రాజుగారికి సాహసికులంటే ఇష్టమనివిన్నాను. మనకు సాహసానికేమీ కొదవలేదు గదా,’’ అన్నాడు ఎంతో ఉత్సాహంగా.

అప్పుడే అక్కడికి వచ్చి, అన్నదమ్ములిద్దరి మాటలూ విన్న రంగరాజు భార్య, ‘‘రాజుగారి దగ్గరకు [illegible] మేం సాహసికులమంటూ [illegible]లు వల్లిస్తే ఏం బాగు? ఏదైనా సాహస కార్యం చేసి వెళితే చెప్పుకోవడానికి బాగుంటుంది,’’ అన్నది.

ఆమె మాటలు అన్నదమ్ములిద్దరికీ నచ్చాయి. ఇటీవల ఒకటికి రెండుసార్లు వాళ్ళ గ్రామం మీద దాడిచేసి, పదిమందీ చేరేలోగానే దాపులనున్న చిట్టడవిలోకి పారిపోయిన పెద్దపులిని చంపాలని నిశ్చయించుకున్నారు.

అన్నదమ్ములిద్దరూ, ఆ మర్నాటి ఉదయమే ఒకరు కత్తీ, ఒకరు ఈటె చేతబట్టి చిట్టడవిలోకి వెళ్ళారు. వాళ్ళ అదృష్టం కొద్దీ పులి ఆ సమయంలో పొదల పక్కన తను చంపినలేడిని తింటూ కంట

శ్రీలలిత



బడింది. పులి, వాళ్ళను చూస్తూనే పెద్దగా గాండ్రించి, మీదికి దూకి వస్తున్న సమయంలో, ఒకరు ఈటెతో దాని గుండెల్లోనూ, మరొకరు కత్తితో దాని డొక్కల్లోనూ బలంగా పొడిచి చంపేశారు.

తర్వాత ఇద్దరూ చచ్చిన పులిని మోసుకుంటూ, గ్రామంలోకి రాగానే, గ్రామస్థులువాళ్ళ చుట్టూ గుమిగూడి, ''ఆహా, ఎంత గొప్ప సాహసం! సాహసికులంటే మీరే!'' అంటూ పొగిడారు.

ఆ రకంగా సాహసకార్యం పూర్తి చేసిన అన్నదమ్ములిద్దరూ, తమకున్న పొలం అమ్మేసి, అవసరమైన సామాన్లు మూటగట్టుకుని, తమ భార్యలతో బళ్ళమీద రాజధానీ నగరం చేరి, అక్కడ ఒక సత్రంలో దిగారు.

మూడవనాడు వాళ్ళు వీరవేషాలు ధరించి, పులి చర్మాన్ని తీసుకుని రాజదర్శనానికి బయల్దేరారు. తమ వేషాల్నీ, తమ భుజాల మీదవున్న పులిచర్మాన్నీ చూసి ద్వారపాలకులు, తమను సగౌరవంగా రాజుగారి దగ్గరకు తీసుకు వెళతారని వాళ్ళనుకున్నారు. కానీ, ద్వారపాలకులు చెరిరెండు రూకలూ లంచం ఇస్తే తప్ప లోపలికి పంపించేది లేదని ఖచ్చితంగా చెప్పేశారు.

అంత నిర్భయంగా లంచం అడుగుతున్న ద్వారపాలకుల ధోరణి, అన్నదమ్ములిద్దరికీ చాలా అసహ్యమనిపించింది. అయినప్పటికీ రాజదర్శనం చేసుకోబోతున్న సంభ్రమంలో వాళ్ళు, ద్వారపాలకులకు చెరి రెండు రూకలూ ఇచ్చేసి లోపలికి అడుగుపెట్టారు.

రాజు చంద్రహాసుడు, వాళ్ళ వీరవేషాలనూ, పులిచర్మాన్నీ చూసి, విసుగుపడుతున్నవాడిలా వచ్చిన పని ఏమిటని అడిగాడు. అప్పుడు అన్నదమ్ములు, తాము పులిని ఎందుకు చంపిందీ, దాన్ని చంపడానికి ఎంత తెగువా, సాహసం ప్రదర్శించిందీ, రాజుకు వివరించారు. రాజు నిరాసక్తిగా, ''ఈ మాత్రపు ధైర్య సాహసాలుగల వాళ్ళు రాజ్యంలో చాలా మందేవున్నారు. అందరికీ కొలువులో స్థానం కల్పించటం జరగని పని!'' అని, అన్నదమ్ములిద్దరికీ చెరొక ఐదు వందల రూకలూ కానుకగా ఇప్పించాడు.

నిరాశతో తిరిగివచ్చిన తమ భర్తల్ని చూసి, వాళ్ళ భార్యలు కూడా దిగులు పడ్డారు. రెండు రోజులు గడిచాక రంగరాజు భార్య, ''ఒక్కొక్కసారి ఆశించినవి జరగవు; ఏం చేస్తాం! మనం తిరిగి గ్రామం వెళ్ళడం అవమానకరం. రాజుగారిచ్చిన డబ్బు పెట్టుబడిగా పెట్టుకుని, ఇక్కడే చిన్న వ్యాపారం ప్రారంభిస్తే మంచిది,''

అంటూ సలహా ఇచ్చింది.

ఆమె సలహా అందరికీ నచ్చింది. తమకు ఆహార ధాన్యాల గురించి బాగా తెలుసుగనక, వెచ్చాల అంగడి ఒకటి పెట్టుకుందామన్న నిర్ణయానికి వచ్చారు అన్నదమ్ములు. ఆ మర్నాటి నుంచే వ్యాపార ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. అయితే, అక్కడా వాళ్ళకు చుక్కెదురయింది! ఎవరైనా వ్యాపారం చెయ్యాలంటే, అందుకు ముందుగా నగరపాలకుడి అనుమతి తీసుకోవాలి. దాని కోసం అన్నదమ్ములు, నగరపాలకుడి భవనానికి వెళ్ళారు. లోపలికి వెళ్ళేసరికి, వ్యాపారానికి అనుమతికావాలంటే నగరపాలకుడికి రెండు వందల రూకలు కానుకగా సమర్పించుకోవాలని తెలిసింది.

ఈ సంగతి తెలియగానే సోమరాజు ఆవేశ పడిపోతూ, "అన్నయ్యా! రాజధానిలో ఎక్కడ చూసినా లంచగొండులేగాని, నిజాయితీ పరుడు మచ్చుకు కూడా కనిపించడం లేదు. సాహసికులందరికీ కొలువులో స్థానం కల్పించడం కుదరని పని అన్న రాజు, లంచగొండులందర్నీ మాత్రం ఏరికోరి నియమించినట్టున్నది! పదా, వెళ్ళి ఆయన్నే అడుగుదాం," అన్నాడు.

తమ్ముడి మాటల్లోని నిజాన్ని కాదనలేని రంగరాజు, "వ్యాపారానికి అనుమతీ అదీ తరవాత. నువ్వన్నట్టు ముందు రాజుగారి దగ్గిరకే వెళదాం," అన్నాడు.

ఇద్దరూ రాజభవనం దగ్గరకు వెళ్ళేసరికి, అక్కడి ద్వారపాలకులు లోగడ అడిగినట్టే లంచం అడిగారు. సోమరాజు ముందుగానే నిర్ణయించుకున్న విధంగా



దీనంగా మొహం పెట్టి, "బాబులూ, మా దగ్గర చిల్లిగవ్వ కూడా లేదు. నాకున్న ఐశ్వర్యమల్లా, ఇదుగో, ఈ బంగారపు ఉంగరం ఒక్కటే! నన్నూ, మా అన్ననూ దయతలచి లోపలికి పంపించండి. రాజుగారి దగ్గర మా పనిగనక చక్కగా పూర్తయిందా, మీకు ఏకంగా ఈ ఉంగరాన్నే బహుమతిగా ఇస్తాను," అన్నాడు.

'ఆ ఉంగరమేదో ఇప్పుడే ఇలా ఇవ్వు,' అంటూ బలవంతంగా సోమరాజు వేలిన ఉన్న ఉంగరం లాక్కున్నారు ద్వారపాలకులు.

ఆ తర్వాత, రాజు చంద్రహాసుడు, వాళ్ళను చూస్తూనే గుర్తుపట్టి, "మళ్ళీ ఏంపని మీద వచ్చారు?" అని ప్రశ్నించాడు.

సోమరాజు రాజుకు మొదటి నుంచీ జరిగిందంతా చెప్పి, "మహారాజా! పులి కన్న భయంకరమైనది అవినీతి జాడ్యం. నామాట అబద్ధమని తమకు ఏమాత్రం

అనువమానం కలిగినా తక్షణం ఆ ద్వారపాలకుల్ని పరీక్ష చేయించండి. వాళ్ళ దగ్గర నా నీలం రాయి బంగారుపు ఉంగరం దొరుకుతుంది," అన్నాడు.

సోమరాజు మాటలు వినగానే రాజు మొహంలో సంతోషం కనిపించింది. ఆయన సోమరాజుకేసి మెచ్చుకోలుగా చూస్తూ, "నాక్కావలసింది సరిగ్గా నీవంటి సాహసికుడే! నువ్వు చెప్పినట్టు, పులి కన్న భయంకరమైన ఈ అవినీతి జాడ్యం, నా కొలువులో చాపకింది నీరులా వ్యాపిస్తున్నదన్న సంగతి, నాకు కొద్ది రోజుల క్రితమే తెలిసింది. అయితే, కనీసం మరొక నలుగురైదుగురు నిజాయితీపరులు, సాహసికుల సహకారం లేనిదే, నేను దీన్ని నామరూపాలు లేకుండా చెయ్యలేను. రాజ్యంలో పెచ్చుమీరుతున్న ఈ అవినీతిని భరించలేక, ఏ ఒక్కడైనా నా దగ్గరకు వచ్చి ఫిర్యాదు చేస్తాడేమో వేచిచూద్దామన్న ఆలోచనతో ఊరుకున్నాను. ఇంకా నిర్లక్ష్యంగా వూరుకుంటే ప్రమాదకరమని, నేను ఆలోచిస్తున్న తరుణంలో, నువ్వు సరిగ్గా భగవంతుడు పంపించినట్టే వచ్చావు!" అన్నాడు.

రాజు ఇలా అనగానే సోమరాజు పట్టరాని ఆనందంలో మరొకసారి వినయంగా ఆయనకు వంగి నమస్కరించాడు.

రాజు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వుండి, తర్వాత సోమరాజుతో, "ఈ నాటి నుంచీ నువ్వు రాజోద్యోగులందరి మీదా పర్యవేక్షణాధికారివి! అవినీతిపరుడెంత పెద్ద ఉద్యోగస్థుడైనా సరే, అతణ్ణి దోషిగా నిర్ణయించి న్యాయస్థానానికి పిలిపించగలిగే అధికారం నీకిస్తున్నాను" అని, రంగరాజుకేసి పరీక్షగా చూస్తూ, "సోమరాజా! మీ అన్న రంగరాజు, నీ అంతటి వాగ్ధాటీ, చొరవావున్న వాడిలా కనిపించడం లేదు. అయినా, పులిని వేటాడటంలో, ఇక్కడి లంచగొండుల ఆట కట్టించడంలో, నీకు సాటిరాగల సాహసి అని తెలుస్తోంది. అతణ్ణి కొత్త నగర పాలకుడుగా నియమిస్తున్నాను," అన్నాడు.

అవిగంగా రంగరాజు, సోమరాజు రాజాస్థానంలో ఉన్నత పదవులు సంపాయించి, కొద్దికాలం లోనే అవినీతినీ, లంచగొండితనాన్నీ నిర్మూలించడంలో కృతకృత్యులై, రాజుకు ఎంతో అభిమాన పాత్రులయ్యారు.



# మూగజీవిసాక్ష్యం

శిశృంగేరిలో, భీమయ్య అనే రైతు తనకున్న నాలుగెకరాల పొలంలో గుమ్మడికాయలు కాయించి, వాటిని కోలార్ పట్టణంలోని దుకాణదారుకు అమ్ముతూండేవాడు. ఒకసారి దూర ప్రాంతాలవున్న బంధువులను కలిసేందుకు వెళుతూ పొలం కాపలా కాసే చెంగయ్యకు చెప్పి, ''తిరిగి రావడానికి నెల రోజులు పడుతుంది. పొలం కాపలా అశ్రద్ధ చేయకు,'' అని హెచ్చరించి వెళ్ళాడు.

చెంగయ్య నాలుగైదు రోజులకొకసారి, తన కొడుకు ఒంటెద్దు బండిలో పదీ పన్నెండు గుమ్మడి కాయలను వేసుకుని కోలార్‌లోని దుకాణదారుకు అమ్మసాగాడు.

నెల రోజులు గడిచాక భీమయ్య తిరిగి వచ్చాడు. అతడు వెళ్ళేప్పుడు సుమారుగా గుమ్మడి పాదులకు ఎన్నెన్ని కాయలున్నదీ లెక్కపెట్టుకుని వెళ్ళాడు. ఇప్పుడు చూస్తే వాటిలో చాలా లేనట్టు తెలిసిపోయింది. అతడు దొంగను పట్టేందుకు ఒక ఉపాయం ఆలోచించాడు. మర్నాడు భీమయ్య, చెంగయ్యను పిలిచి, ''చెంగయ్యా! నీ కొడుకు ఒంటెద్దు బండిని ఉదయాన్నే తీసుకురా. పట్నంలో గుమ్మడికాయలు అమ్ముకురావాలి,'' అని చెప్పాడు.

మర్నాడు చెంగయ్య బండి తోలుకు వచ్చాడు. భీమయ్య పాతిక గుమ్మడికాయలు కోయించి బండిలో వేశాక, చెంగయ్యతో, ''ఒంట్లో కాస్త నలతగావుంది. దారిమార్గమంతా కుదుపులు. ఎద్దును అదిలించి తోలకు. దాని దారిన దాన్ని పోనీ,'' అన్నాడు.

చెంగయ్య అలాగే చేశాడు. బండెద్దు సరాసరి పట్నంలోని దుకాణం ముందుకు వెళ్ళి ఆగింది. దుకాణదారు బండిలోని గుమ్మడికాయలు చూసి చెంగయ్యతో, ''ఎప్పుడూ పదీ పన్నెండు కాయలకంటే ఎక్కువ తేనివాడివి, ఒకేసారి ఇన్ని కాయలు తెచ్చావేం?'' అన్నాడు. చెంగయ్య దొంగతనం బయట పడింది. భీమయ్య, అతడితో, ''బండెద్దులు అలవాటైన చోట్లకు ఎవరూతోలకుండానే అలా నడిచి పోగలవు. ఇప్పుడీ మూగజీవి, నువ్వు దొంగవని సాక్ష్యం చెప్పింది! నిన్ను పనిలోంచి తీసేస్తున్నాను,'' అన్నాడు.

– కోలార్ కృష్ణఅయ్యర్





# ఖరీదైన అబద్ధం

బడి గంట మోగింది, తరగతులు మొదలయ్యాయి. తరగతి మొదలవగానే సుందరం చాలా సంతోషంగా ఉన్నాడు, ఈలోగానే ఉపాధ్యాయుడు పిడుగులాంటి వార్త పేల్చాడు. ఇంటివద్ద రాసుకొచ్చిన హోమ్ వర్క్‌ని చూపంచమని పిల్లలను అడిగాడు. సుందర్‌కి అప్పుడు గాని తాను హోమ్‌వర్క్ చేయలేదని గుర్తుకు రాలేదు.

మామూలుగా అయితే ఉదయం నిద్రలేచిన తర్వాత తను హోమ్‌వర్క్ చేసేవాడు. సుందర్ అమ్మ ఎల్లప్పుడూ ముందురోజు సాయంత్రమే హోమ్‌పని పూర్తి చేయవలసిందిగా సూచించేది.

సుందర్ తన తల్లి ఆదేశాన్ని పాటించాలి గౌరవించాలి. కాని అతడికి ఇష్టమైన అంశాలు మరెన్నో ఉన్నాయి మరి. స్నేహితులతో కలిసి క్రికెట్ ఆడటం అతనికి చాలా ఇష్టం. తర్వాత టీవీలో తన కిష్టమైన కార్టూన్ సినిమాలు చూసేవాడు. రోజంతా టీవీ చూడమన్నా చూస్తాడతడు. రాత్రి భోజనం ముగించగానే నిద్రపోవడం అంటే అతనికి ఎంతో ఇష్టం. ముందురోజంతా ఇలా సమయం అస్సలు సరిపోదు కనుకే మామూలుగా అతడు హోమ్ వర్క్‌ను మరుసటిదినం ఉదయం మాత్రమే చేసేవాడు. తన అలవాటును మార్చుకోవాలని తల్లి ఎంతగా చెప్పినా సుందర్ వినేవాడు కాదు.

మరి ఈ రోజు అతడు హోమ్‌వర్క్ ఎందుకు చేయలేకపోయాడు? బలమైన కారణం ఉంది. ముందురోజు సాయంత్రం వీధిలో క్రికెట్ ఆడుతుండగా అతడు అద్భుతమైన క్యాచ్ పట్టుకోవాలని చూశాడు. కాని క్యాచ్ పట్టుకోవటం తప్పిపోయింది. అతడు కింద పడి మోకాలుకు గాయం తగిలింది. తల్లి అతడి గాయాలకు కట్టుకట్టి విశ్రాంతి తీసుకోమని చెప్పింది.

కె.పి.పద్మనాభన్

మరుసటి దినం మోకాలు నొప్పి తగ్గక పోవడంతో అతడు హోమ్ వర్క్ గురించి మర్చిపోయాడు. ఉపాధ్యాయుడు మాత్రం తరగతిలో ఇలాంటివాటిని సహించే రకం కాదు. అయితే సుందరం మొద్దబ్బాయి కాదు కాబట్టి తన సమస్యకు వెంటనే ఒక తగిన పరిష్కారం కూడా ఆలోచించాడు.

సుందరం తరగతిలో ఉపాధ్యాయుడి ముందుకెళ్లి వంగి నిలబడ్డాడు. 'సర్, నిన్నటిదినం నేను బడినుంచి వెళుతుండగా, కాలు జారి మా వీధి చివర ఉన్న మురికికాలువలో పడిపోయాను. నా నోట్ పుస్తకాలతో పాటు హోమ్‌వర్క్ నోట్ కూడా కాలువలో పడిపోయింది. తర్వాత సాయంత్రం పూట డాక్టర్‌ని కలిశాను. దీంతో నేను హోమ్ వర్క్ చేయలేకపోయానండి!' అని చెబుతూ తన కాలి గాయాన్ని చూపించాడు. అతడు దీనంగా చెప్పేది వింటే రాయి సైతం కరిగి నీరవ్వాల్సిందే మరి.

మరి సుందర్‌కి పాఠం చెప్పే ఉపాధ్యాయుడు మానవమాత్రుడాయె. నిలువునా కరిగిపోయాడు. 'బాధపడకు సుందర్. ఈ కొత్త నోట్ పుస్తకం తీసుకో. నీకు తన నోట్ బుక్ ఇవ్వమని రాజాకు చెబుతాను. అతడి నోట్ లోంచి మొత్తం పేజీలను నువ్వు అలాగే కాపీ చేయి చాలు! సోమవారం నోట్‌బుక్ తీసుకువచ్చి నాకు చూపు.'

ఉపాధ్యాయుడి మాటలు సుందర్‌కి శరాఘాతంలాగా తగిలాయి. ఒక్కసారిగా హడలిపోయాడు. ఇప్పుడు అతడు మొత్తం ముప్పై పుటలను తిరగరాయాలి. దేవుడా! ఎంతపని జరిగింది. ఇప్పుడిక తన వద్ద మంచి స్థితిలో ఉన్న పాత నోట్‌బుక్‌ని కూడా చూపలేడు.

తాను ప్రకటించినట్లుగా అది కాలువలో పడిపోయింది మరి! కొత్త నోట్‌బుక్‌ను తీసుకుని తొలినుంచి ముప్పై పేజీలు రాయవలసిందే మరి. నిజం చెప్పిఉంటే తక్కువ శిక్షతో సరిపోయేది కాని తానాడిన చిన్న అబద్ధం అతడిని పెద్ద చిక్కులోకి నెట్టింది మరి!



# ఎవరు చెప్పారు?

ఒక ముదుసలి ఒక ఊరునుంచి మరొక ఊరుకు నడిచిపోతోంది. చేతుల్లో బరువైన వస్తువును మోసుకుపోతోంది. అప్పుడే ఒక గుర్రపు రౌతు ఆమెను దాటి పోయాడు. అతడిని ఆగమంటూ ఆమె పెద్దగా కేక పెట్టింది. అతడు ఆగగానే, 'అబ్బాయీ! ఈ మూటను కాస్త నీ గుర్రంపై తీసుకుపోయి పొరుగునున్న గ్రామంలో నాకోసం వేచి ఉండగలవా? నేనక్కడికి త్వరలో వచ్చి నా మూటను నేను తీసుకుంటాను,' అన్నది. కాని అసహనంగా ఉన్న గుర్రపు రౌతు ఆమె మాటలను పట్టించుకోలేదు. 'నీకోసం వేచి చూసేంత సమయం ఎవరికుంది?' అంటూ ఆమెను నిర్లక్ష్యంగా చూస్తూ గుర్రాన్ని దౌడు తీయించాడు. కొంత దూరం వెళ్లాక అతడిలో ఒక దురాలోచన కలిగింది. ఆ ముసలిది నాకిచ్చే మూటలో విలువైన వస్తువులే ఉండవచ్చు. ఆ మూటను తీసుకుని నా దారంట నేను పోతే అడిగేదెవరు? ఆమె ఎలాగూ నన్ను పట్టుకోలేదు.

ఇలా ఆలోచిస్తూ, అతడు వెనక్కు వచ్చి ఆమె మోస్తున్న మూటను తనకివ్వమని అడిగాడు. ఆశ్చర్యకరంగా అతడి మాటను ఆమె తోసిపుచ్చింది. 'లేదు లేదు. నా మూట నేనే మోసుకొస్తాను,'

ఆ రౌతు పాలిపోయిన ముఖంతో అన్నాడు. 'ఎందుకు నువ్వు మోయడం?'

'ఇప్పుడు నేను నిన్ను నమ్మలేను కాబట్టి!' అన్నదా ముదుసలి. ఆమె గడ్డం కాస్తా పైకి ఎత్తి నిలబడింది. కళ్లు మెరుస్తున్నాయి.

'ఇలా మాట్లాడమని నీకెవరు చెప్పారు?' అన్నాడా రౌతు అసహనంతో. 'వెనక్కు నీకు రమ్మని సలహా ఇచ్చిన వాడే చెప్పాడు,' తిరుగులేని సమాధానం చెప్పిందామె.

– ప్రవీణ్ చంద్ర జైన్



# వ్యాపారంలో పోటీ

శేషయ్య, భూషయ్యలు ఆ ఊరిలో ప్రముఖ వ్యాపారస్థులు. ఇద్దరి మధ్య గట్టిపోటీ వుండేది. ఒక రోజు, ఒక యువకుడు భూషయ్య వద్దకు వచ్చాడు. పద్దులు రాసు కుంటున్న భూషయ్య కాసేపయ్యాక తల ఎత్తి, ఎవరన్నట్టు అతడికేసి చూశాడు.

''అయ్యా! నా పేరు తిరుపతి. శేషయ్యగారి వద్ద గుమాస్తాగా పనిచేసేవాణ్ణి. అక్కడ జీతం సరిపోక పనిమానేశాను. మీ దగ్గర ఖాళీవుంటే చేస్తాను,'' అన్నాడు.

భూషయ్య క్షణం ఆలోచించి, ''ఇక్కడ కొంత కాలం పని చేశాక, మళ్ళీ జీతం పెంచమని అడగవని నమ్మకం ఏమిటి?'' అన్నాడు. ''జీతం సరిపోదనిపిస్తే, అప్పుడు పెంచమని అడగడంలో తప్పులేదు కదండీ,'' అన్నాడు తిరుపతి.

''నిన్ను పనిలోకి తీసుకుంటే, నాకు ప్రత్యేకంగా లాభంవుందా?'' అని అడిగాడు భూషయ్య. '' మీరనేది నాకర్థంకాలేదండి!'' అన్నాడు తిరుపతి వినయంగా.

''అదే.. అక్కడ వ్యాపారానికి సంబంధించి ఎలా నడుస్తోందీ వగైరా విషయాలు నాకు చెప్పగలవా?'' అని అడిగాడు భూషయ్య.

''అది కుదరదండి. ఎందుకంటే, అక్కడి రహస్యాలు మీకు చెబితే, మీరు నన్ను పనిలోకి తీసుకోరు,'' అన్నాడు తిరుపతి. ''ఎందుకనీ?'' అంటూ భూషయ్య కాస్త మాటసాగదీశాడు.

''ఇక్కడి విషయాలు మళ్ళీ అక్కడ చెప్పవని నమ్మకం ఏమిటి? అని అడుగుతారు,'' అన్నాడు తిరుపతి.

ఆ జవాబు వింటూనే భూషయ్య పెద్దగా నవ్వి, ''తిరుపతీ! నీ జవాబు నీ తెలివి తేటల్నే కాదు, నిజాయితీని కూడా తెలియజేస్తున్నది. నాకూ ఆ శేషయ్యకూ వ్యాపారంలో పోటీయే గాని, గుమాస్తాల విషయంలో పోటీ లేదు. రా, రా, ఈ పద్దుపుస్తకం అందుకో, నిన్ను పనిలోకి తీసుకుంటున్నాను!'' అన్నాడు. - కె. లక్ష్మీకాంతమ్మ





# రామకృష్ణులు

నారాయణపురంలోవున్న ధనవంతుల్లో నరసింహం ఒకడు. అందరితో మంచిగా వుంటూ, అడిగిన వారికి లేదనకుండా సహాయం చేస్తాడని, ఆయనకు పేరున్నది.

ఒక రోజు ఉదయం ఆయన స్నానం చేసి, పూజకోసం ఇంటి ముందున్న నంది వర్ధనం పూలు కోస్తూండగా, "అయ్యగారూ, నమస్కారం! నరసింహంగారంటే తమరేగ దండీ?" అంటూ ఒక పన్నెండేళ్ళ కుర్రాడు వచ్చాడు.

"అవును, నువ్వెవరివి? ఏంకావాలి నీకు?" అని అడిగాడు నరసింహం.

"నా పేరు కృష్ణుడు. మీ ఇంట్లో పనికావాలి అయ్యగారూ!" అన్నాడు కుర్రాడు వినయంగా చేతులు జోడించి.

నరసింహం నవ్వి, "నువ్వేం పనిచేయగలవు, కృష్ణా?" అని అడిగాడు.

"ఏ పని చెప్పినా చేస్తాను. చిన్నప్పుడే అమ్మా నాన్నా పోయారు. మామయ్య ఇంట్లో పెరిగాను. మా అత్తయ్య ఇంటి పనంతా నా తోనేచేయించేది. వాళ్ళ పిల్లలు పెద్దవాళ్ళవడంతో ఖర్చు పెరిగిందని, నాదారి నన్ను చూసుకోమన్నారు. మా ఊళ్ళో మీ గురించి గొప్పగా చెప్పుకుంటారు. అందుకే మీ ఇల్లు వెతుక్కుంటూ వచ్చాను," అన్నాడు కృష్ణుడు.

నరసింహం కాస్సేపు ఆలోచించి, "నీకివ్వడానికి మా ఇంట్లో పనేంలేదు. నువ్వు చదువుకుంటానంటే చదువు చెప్పిస్తాను," అన్నాడు.

కృష్ణుడు చప్పున నరసింహం కాళ్ళ మీద పడి, "నాకు చదువంటే ప్రాణం! ఈ సంవత్సరమే మా అత్తయ్య, నా బడిమాని పించేసింది," అన్నాడు కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూండగా.

నరసింహం, లోపలి గదిలోవున్న అదే ఈడువాడయిన తన కొడుకు రాముడిని పిలిచి, "ఈ అబ్బాయి పేరు కృష్ణ. నీతో పాటు నీగదిలోనే వుంటాడు. నీతో బడికి తీసుకెళ్ళు. నేను పంతులుగారితో మాట్లాడతాను," అన్నాడు.

"అలాగే, నాన్నా!" అంటూ కృష్ణుడిని

మాచిరాజు కామేశ్వరరావు

తనగదిలోకి తీసుకుపోయాడు రాముడు.

నరసింహం భార్య భాగేశ్వరికి ఇది ఏ మాత్రం నచ్చలేదు. "ఎంతమంది అనాధలను, ఇలా చేరదీసి పోషించగలం?" అన్నది కోపంగా.

"చూద్దాం!" అంటూ నవ్వేశాడు నరసింహం.

కృష్ణుడు ఇంటి పనిలో భాగేశ్వరికి సహాయపడుతూనే, రాముడితో బడికి వెళ్ళి చదువు కునేవాడు. కృష్ణుడు తన తరగతిలో చేరనంత కాలం, రాముడు ఏ పరీక్ష పెట్టినా ప్రథముడుగావచ్చేవాడు. ఇప్పుడు రాముడికి ఏ పరీక్షలో అయినా ద్వితీయ స్థానంతో సరిపెట్టుకోవలసివచ్చింది. అన్ని పరీక్షలలోనూ, కృష్ణుడిదే ప్రథమ స్థానం.

ఇది గమనించిన నరసింహం, "కృష్ణుడు నీకన్నా తెలివైనవాడు. నీకు తెలియనివి వాడిని అడిగి చెప్పించుకో," అన్నాడు రాముడితో.

తండ్రి అలా అనడం ఎంతో అవమానంగా తోచింది, రాముడికి. వాడొక రోజు తల్లితో, "అమ్మా, ఆ కృష్ణుడిని ఇంట్లోంచే కాదు, బడిలోంచి కూడా పంపించేయండి. నేనే తరగతిలో ప్రథముడిగా వుండాలి," అన్నాడు.

భాగేశ్వరి ఆ మాటలకు నెత్తిబాదుకుని, "నేను ముందు నుంచే, ఈ తద్దినాన్ని ఇంట్లోకి తీసుకురావద్దన్నాను. మీ నాన్నకు నా మాట అంటే లక్ష్యం లేదు!" అన్నది.

తర్వాత ఆమె పెరట్లో బాదం చెట్టు కింద కూర్చుని చదువుకుంటున్న కృష్ణుడి దగ్గరకు వెళ్ళి, "ఒరే, కృష్ణా! తరగతిలో ఏ



పరీక్ష పెట్టినా నువ్వు ఒక ప్రశ్నకు జవాబు రాయకుండా వదిలేయి, తెలిసిందా?" అన్నది.

"నాకు అన్ని ప్రశ్నలకూ జవాబులు తెలుసు, అమ్మగారూ!" అన్నాడు కృష్ణుడు, ఆశ్చర్యంగా భువనేశ్వరి ముఖంలోకి చూస్తూ.

"అయినా సరే! ఇకపై ప్రతి పరీక్షలోనూ ఒక ప్రశ్నకు సమాధానం రాయకూడదు. అంతే," అన్నది భాగేశ్వరి కరకుగా.

ఆ తర్వాత అన్ని పరీక్షలలోనూ రాముడికి ప్రథమ స్థానం, కృష్ణుడికి ద్వితీయ స్థానం రాసాగింది. ఈ మార్పు పంతులుగారికి ఆశ్చర్యంకలిగించింది. తరచి తరచి అడిగి, కృష్ణుడి ద్వారా సంగతంతా తెలుసుకున్న అయన, కృష్ణుడికి ప్రత్యేకపరీక్ష పెట్టి, వాణ్ణి పైతరగతికి పంపించేశాడు. తరగతిలోంచి కృష్ణుడు వెళ్ళి పోవడంతో ఎంతో ఆనందంకలిగింది, రాముడికి.

పంతులుగారి ద్వారా జరిగిందేమిటో తెలుసుకున్న నరసింహం, ఆయనతో, ''మీరు చేసిన పనివల్ల కృష్ణుడికి న్యాయం జరిగింది, అయితే రాముడు నష్టపోయాడు. పక్కవారిని చూసి ఈర్ష్యపడకూడదని, రాముడు గ్రహించాలి. తెలియనివి ఎవరి నైనా అడిగి తెలుసుకోవడంలో తప్పులే దనీ, మనిషి మానసికంగా ఎదగడానికి పోటీ అనేది తప్పని సరిగావుండాలనీ, రాముడికి తెలియాలి. రాముడు మంచి బాలుడుగా ఎదిగే ప్రయత్నం మీరే చేయాలి, పంతులుగారూ!'' అన్నాడు.

ఇందుకు పంతులుగారు కాసేపు ఆలో చించి, ''సరే, రాముడికి కూడా నష్టం జర క్కుండా చూస్తాను,'' అన్నాడు.

ఆ రోజు తరగతిలో పంతులుగారు, ఒక కథ చెప్పాడు: అనగనగా ఒక రాజు. ఆయ నకు ఒక్కడే కొడుకు. ఈ యువరాజు గుర్రపు స్వారీలో దిట్ట. తరచుగా గుర్రాన్ని అడవిలో దౌడు తీయించేవాడు. అతణ్ణి, తమ గుర్రా లతో అందుకోవడం, పరివారంలో ఎవరికీ సాధ్య పడేదికాదు. అందరూ గుర్రపు స్వారీలో యువరాజును మించిన వాళ్ళు లేరని పొగడుతూండేవాళ్ళు.

ఒకనాడు అనుకోకుండా యువరాజుకు, కోయలనాయకుడి కొడుకుతో పరిచయ మైంది. ఆ కోయయువకుడు, యువ రాజు కన్నా వేగంగా, గుర్రపుస్వారీ చేసేవాడు. ఇప్పుడు పరివారంలోని వాళ్ళు అతణ్ణి మరింతగా పొగడసాగారు. అది యువరాజు కు నచ్చలేదు. ఈర్ష్యతో అతడి మనసు రగిలిపోసాగింది.

ఒకసారి కోయయువకుడు, యువ రాజుతో, ''గుర్రాన్ని వేగంగా పరిగెత్తించ డమే కాదు, నీకు మరికొన్ని ఒడుపులు కూడా నేర్పుతాను,'' అన్నాడు.

''నీ దగ్గర నేర్చుకునే ఖర్మ నాకు పట్ట లేదు. నాకు పోటీదార్లంటేగిట్టదు. ఇకపై నా కంటపడకు!'' అన్నాడు యువరాజు కోపంగా.



ఆ తర్వాత ఒక రోజున యువరాజు, తన పరివారం నుంచి వేరుపడి, అడవిలో చాలా దూరం వెళ్ళాడు. కోయయువకుడు కొండ దేవతకు మొక్కుకుని, గుర్రం మీద వస్తూ యువరాజును పలకరించబోయాడు. కానీ, యువరాజు అయిష్టంగా ముఖం తిప్పేసుకున్నాడు. అంతలో పొదల చాటు నుంచి, ఒక చిరుతపులి గాండ్రిస్తూ వాళ్ళకేసిదూకింది.

యువరాజు వెంటనే ఒరలోంచి కత్తి దూయ బోయాడుగాని, గుర్రంబెదిరి, అతడి స్వాధీనంతప్పి చెట్ల మధ్య అటూ ఇటూ పరిగెత్తసాగింది. చిరుతపులి దాన్ని వెంబడించింది. ఐతే, ఈ లోపల బెదిరిన తన గుర్రాన్ని, కోయయువకుడు కళ్ళాలను బిగించి పట్టుకుని అదుపు చేసి, జీను నుంచి వేళ్ళాడుతున్న బళ్ళాన్నిలాగి గురిగా చిరుతపులి కేసివిసిరాడు. బళ్ళెం దానివెన్నులో దిగింది. చిరుతపులి పెద్దగా ఒకసారి గాండ్రించి కింద పడిగిలగిలా తన్నుకోసాగింది. యువరాజు వెను తిరిగి చూసి, జరిగిందేమిటో గ్రహించి, గుర్రాన్ని కోయయువకుడి దగ్గరకు నడిపి, ''నువ్వు గుర్రపుస్వారీలో గొప్ప ఒడుపులు నేర్చిన వాడివేకాదు, సమయస్ఫూర్తిని కూడా ఎరిగినవాడివి. నా ప్రాణంకాపాడావు, కృతజ్ఞుణ్ణి!'' అన్నాడు.

ఈ కథచెప్పిపంతులుగారు, ''చూశారా! యువరాజు, కోయయువకుడి దగ్గర గుర్రపుస్వారీలోమెళకువలు తెలుసుకొనుంటే, చిరుతపులిని ఎదిరించడంలో విఫలుడయ్యే వాడు కాదు గదా! మనిషి ఆ జన్మాంతం విద్యార్థే. తెలియని విషయాలు, తెలిసిన వాళ్ళను అడిగి తెలుసుకోవడం చిన్నతనంగా భావించకూడదు. మన ఈర్ష్య మనకే ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది. మనం ఎదగాలంటే, మన పక్కన మనకంటే అన్ని విషయాల్లో ఉన్నతుడైనవాడుండాలి. పోటీ తత్వం వున్నప్పుడే మనం పైకిరాగలం!'' అన్నాడు రాముడి ముఖకవళికలు గమనిస్తూ. మర్నాడు రాముడు, పంతులుగారితో, ''నాక్కూడా ప్రత్యేకపరీక్ష పెట్టి, పై తరగతికి పంపించండి. నేను కృష్ణుడితో పోటీ పడి చదవాలనుకుంటున్నాను,'' అన్నాడు.

రాముడిలో వచ్చిన మార్పుకు, పంతులుగారు ఎంతో సంతోషించాడు.





# మోసం

నిరంజనవరంలో సుమిత్రుడనే యువకుడైన ఒక సామాన్య వ్యవసాయదారుడుండేవాడు. ఈ మధ్యనే అతని దూరపు బంధువు ఒకాయన పోతూ పోతూ తనకు సంతానం లేని కారణాన తన ఆస్తినంతా సుమిత్రుని పేర రాసి పోయాడు.

అయాచితంగా వచ్చిన ఆ ఆస్తిని అమ్మి సొమ్ముచేసుకున్న సుమిత్రుడు ఆ డబ్బుతో ఏదైనా వ్యాపారం చేద్దామనే నిర్ణయానికి వచ్చాడు. నగరంలో వుండే తన మిత్రులు సందీపుడు, సారంగుడు అనే వాళ్ళతో కలసి వ్యాపారం మొదలు పెట్టాడు.

సుమిత్రుడు వూళ్ళో వ్యవసాయం చేసుకుంటూనే అప్పుడప్పుడు నగరం వచ్చి మిత్రులను కలుస్తూండేవాడు. మొదట కొంతకాలం వ్యాపారంలో విపరీతమైన లాభాలోచ్చాయి. సుమిత్రుడి ఆనందానికి మేరలేదు.. వ్యాపారం చేస్తే అంతలా డబ్బు సంపాదించొచ్చని అతనికి అంతకు ముందు తెలియదు. మొదటిసారి అనుభవంలోకి వచ్చేసరికి ఉబ్బి తబ్బిబ్బు అయ్యాడు. మిత్రులు అడిగినప్పుడల్లా మరింత పెట్టుబడి పెడుతూ పోయాడు. వూళ్ళో కొంత పొలం అమ్మి నగరంలో ఒక ఇల్లు కొనుక్కొని భార్య పిల్లలతో కాపురం నగరానికి మార్చాడు.

వ్యాపారంలో విపరీతమైన లాభాలను చూస్తున్న సుమిత్రుడికి ఎంతకూ ఎదుగుదల లేని వ్యవసాయం అంటే విరక్తి కలుగ సాగింది. క్రమంగా కొద్దికొద్దిగా పొలాన్ని అమ్ముతూ వ్యాపారంలో పెట్టుబడి పెడుతూ పోయాడు.

కొంతకాలం తర్వాత వ్యాపారంలో నష్టం వచ్చింది. సుమిత్రుడు ఆందోళన పడేసరికి సందీపుడు, సారంగుడు కలసి మిత్రుని ఓదార్చి, వ్యాపారం అన్నాక ఇదంతా మామూలే, మనం ఏమాత్రం విచారించవలసిన పని లేదు. లాభం నష్టం వెలుగు, చీకట్లవంటివి. ఇప్పుడు మనం కొంత

దాసరి వెంకట రమణ

స్థిమితపడితే త్వరలోనే పుంజుకొని మళ్ళీ విపరీతమైన లాభాలను కళ్ళ చూస్తాం. అన్నారు. సుమిత్రుడు మిత్రుల మాటలకు సమాధానపడి వాళ్ళడిగిన పెట్టుబడి సర్దాడు.

మరికొంతకాలం గడిచింది. వ్యాపారంలో మళ్ళీ నష్టాలొచ్చాయి. కలవరపడుతున్న సుమిత్రుడిని మిత్రులిద్దరూ కూర్చోబెట్టి, మరికొద్దికాలం ఓపిక పడితే అంతా సర్దుకుంటుంది అంటూ నచ్చజెప్పారు. సుమిత్రుడు మళ్ళీ సమాధానపడ్డాడు.

పరిస్థితులు సుమిత్రుడిలో ఒకవిధమైన భయాన్ని కలిగించసాగాయి. నిత్యం వ్యాపారం ఏమౌతుందోనని దిగులు పడసాగాడు. అతని ఆరోగ్యం కూడా పాడయింది. ఆ పరిస్థితి చూసి భార్యా పిల్లలు బాగా ఆందోళన చెందారు. ఇంతకుముందు వూళ్ళో వ్యవసాయం చేస్తూ వున్నప్పుడే చాలా ఆనందంగా, సుఖంగానూ వుండే వాళ్ళమని వాళ్ళకు అన్పించింది.

మరికొంత కాలానికి సుమిత్రుడు భయపడ్డట్టు గానే వ్యాపారంలో విపరీతమైన నష్టం వచ్చింది. ఎంత నష్టమంటే.. పెట్టిన పెట్టుబడి పోనూ మరికొన్ని అప్పులు మీద పడ్డాయి.

సందీపుడు సుమిత్రుడికి నచ్చజెప్తూ 'అయ్యిందేదో అయ్యింది. ఎలాగోలా ఈ అప్పులు తీర్చి, మళ్ళీ కొత్తగా వ్యాపారం మొదలు పెడదాం' అన్నాడు. సుమిత్రుడు నిర్లిప్తంగా, ఉదాసీనంగా ఒకసారి మిత్రుని ముఖంలోకి చూసి అక్కడి నుండి లేచి ఏమీ మాట్లాడకుండా ఇంటికి వచ్చేశాడు.



పరువు, మర్యాదలే ప్రాణంగా బ్రతికే సుమిత్రుడు నగరంలోని ఇల్లు అమ్మి, వ్యాపారంలో తన వాటాకు వచ్చిన అప్పులన్నీ తీర్చి, వ్యాపారం మానుకొని భార్యా పిల్లలతో మళ్ళీ పల్లెటూరు చేరాడు. అమ్మగా మిగిలిన పొలం సుమిత్రున్ని అమ్మలా ఆదరించింది. ఆ కాస్త పొలంలో సుమిత్రుడు ఎప్పటిలా వ్యవసాయం చేసుకుంటూ వుండిపోయాడు.

ఇలావుండగా సుమిత్రుని చెవిన ఒక మాట పడింది. తమ వ్యాపారంలో బాగా లాభాలొచ్చినప్పటికీ సందీపుడు దొంగ లెక్కలు చూపించి మోసం చేశాడని. సుమిత్రుడు ఆ మాటలు నమ్మలేదు. కానీ తరువాత ఇద్దరు ముగ్గురి ద్వారా అదే మాట వినపడేసరికి సుమిత్రునికి అనుమానం వచ్చి, నగరం చేరి వాకబు చేశాడు.

నగరంలో సుమిత్రుడికి చాలా విష



యాలు తెలిశాయి. గతంలో బాగా నష్టా లొచ్చిన వ్యాపారం. ఇప్పుడు బాగా నడు స్తోంది. సందీపుడి ఆర్థిక పరిస్థితి గతంలో కంటే ఇప్పుడు చాలా మెరుగయింది. అత్యంత ఆశ్చర్యం ఏమిటంటే సందీ పుడు ఇతర మిత్రులతో కలసి చేసే వ్యాపా రాలన్నీ చాలా బాగా నడుస్తున్నాయి, వాటి ద్వారా బాగా లాభాలొస్తున్నాయి.

సుమిత్రుడి అనుమానం బలపడింది. ఒకరోజు అతడు సందీపుడ్ని కలిశాడు. మిత్రుని చూడగానే సందీపుడు లేచి ఎదురొచ్చి, మర్యాద పేరుతొ నా హడా విడి చేశాడు. కుశల ప్రశ్నల అనంతరం సందీపుడు సుమిత్రుడితో 'నీతో అప్పుడే చెప్పానా వ్యాపారం అన్నాక ఒడిదుడు కులు సర్వ సాధారణమని, ఇప్పుడు చూడు అదే వ్యాపారం ఇబ్బడి ముబ్బడిగా లాభాలు' అన్నాడు విలాసంగా నవ్వుతూ.

ఆ నవ్వు సుమిత్రుడికి వొంటిమీద కారం రాసినట్లుగా అయింది. ఏమీ మాట్లాడకుండా కాసేపు కూర్చొని, 'మన వ్యాపారం తాలూకు లెక్కలు ఒకసారి చూద్దాం' అన్నాడు. సందీపుడు ఏమాత్రం కంగారు పడకుండా 'అయ్యో ఇంకెక్కడి లెక్కలు అప్పుడే చించేశాం కదా! అయినా వాటిని అట్టేకాలం భద్రపరచడం మనకు అస్సలు మంచిది కాద'న్నాడు.

సందీపుడు తనను బాగా మోసం చేశా డని నిర్ధారణకు వచ్చాడు సుమిత్రుడు. అది మొదలు కనిపించిన ప్రతి ఒక్కరి తోనూ తనకు సందీపుడు చేసిన మోసం గురించి చెప్పసాగాడు.

అలాగే తమ ఊరి బడిపంతులు రమణయ్యతో కూడా చెప్పాడు. రమ ణయ్య చాలా తెలివైన వాడు, మంచి వాడు. అతడు సుమిత్రుడు సుదీర్ఘంగా చెప్పిందంతా సావధానంగా విని, కాసేపు మౌనంగా వుండి, జరిగిన దాంట్లో సందీ పుడి పొరపాటు ఏమీ లేదు. అన్నీ నీ పొర పాట్లే కనబడుతున్నవి. అన్నాడు.

సుమిత్రుడు ఉలిక్కిపడ్డాడు. తనది పొరపాటు అనే సరికి చాలా ఆశ్చర్యం కలిగింది. రమణయ్యకు అర్థం కాలేదే మోనని సందీపుడు తనను ఎంతగా మోసం చేసింది మళ్ళీ వివరించబో యాడు. రమణయ్య అతన్ని వారిస్తూ, సందీపుడు నిన్ను బాగా మోసం చేశా డని నేను నమ్ముతున్నాను. కానీ జరిగిన దాంట్లో నీ తప్పు చాలా వుంది. ఎదుటి వాడు మనలను ఒకసారి మోసం చేస్తే తప్పు వాడిది. రెండో సారి మోసం చేస్తే మాత్రం తప్పు మనదే.

వ్యాపారం లాభ నష్టాలకు సంబంధించి సందీపుడిని ఏనాడూ నీవు లెక్కలు అడగలేదు. అవునా!

'అవును ప్రాణ స్నేహితుడు కదా అని నమ్మి అంతా తన మీదే వదిలేశాను.'

నీలో వున్న మొహమాటాన్ని, సోమరితనాన్ని, కప్పిపుచ్చుకునేందుకు అతని మీద నమ్మకం అనే నెపం వేస్తున్నావు. నీకు వ్యాపారం గురించి పూర్తి వివరాలు తెలియవు. సరుకు ఎంతకు కొనేది తెలియదు. ఎంతకు అమ్మేది తెలియదు. లెక్కలేమీ అడక్కుండానే అడిగినప్పుడల్లా పెట్టుబడి పెడుతూ పోయావు. మట్టి పనికి పోయినా ఇంటి వాడుండాలనే సామెత నీవెప్పుడూ వినలేదా!

అంతా జరిగాక నీవు చేసిన పెద్ద పొరపాటు ఏమిటంటే సందీపుడు నిన్ను మోసం చేశాడని అందరికీ చెప్పడం. అందువల్ల నీకు వ్యవహార జ్ఞానం లేదని నలుగురికీ తెలిసి నీవు చులకన అవడం మించి నీకు ఒరిగేదేమీ వుండదు.

సందీపుడంటే గిట్టనివాళ్ళు నీ ముందు అతడిని బాగా తిట్టి నీ మెప్పు పొందడానికి ప్రయత్నిస్తారు. మరికొంత మంది నీ అమాయకత్వాన్ని వాడుకొనేందుకు, సందీపున్ని వదిలెయ్యి మనం కలసి వ్యాపారం చేద్దామనే ప్రతిపాదన కూడా నీ దగ్గర తెచ్చి వుంటారు. ఎందుకంటే నీ లాంటి వాళ్ళు వాళ్లకు చాల అరుదుగా దొరుకుతారు కాబట్టి, అన్నాడు రమణయ్య.

ఆ సంఘటనలన్నీ సుమిత్రుడి కళ్ళ ముందు కదలాడాయి. రమణయ్య చెప్పినవి అక్షర సత్యాలు. మోసం చేసిన వాడిది కాదు. మోసం చేసే అవకాశం ఇచ్చిన వాడిదే తప్పు.

తనకు తెలివి వచ్చేలా చేసిన రమణయ్యకు కృతజ్ఞతలు తెల్పుకొని, ఈ సారి స్వంతంగా వ్యాపారం ప్రారంభించి, నిదానంగా వ్యాపారమెళకువలు నేర్చుకుంటూ, త్వరలోనే సంపన్నుడయ్యాడు. తప్పు జరిగినపుడు కుములుతూ కూర్చోవడం కన్నా దాని ద్వారా వచ్చిన అనుభవాన్ని తిరిగి పెట్టుబడిగా పెట్టి జీవితంలో మళ్ళీ ఎదగ వచ్చు అనే జీవనసత్యాన్ని సుమిత్రుడు ప్రపంచానికి చాటాడు.





# పోరునష్టం

వాళ్లిద్దరూ ఒకే ఇరుగు పొరుగున ఉంటారు. ఇద్దరిలో ఒకాయన ఎంతో ధనవంతుడైతే, రెండోవాడు మామూలు చిన్నరైతు. ధనవంతుడి విలాసవంతమైన భవంతికి కొద్ది ఎడంగా రైతు కూడా ఒక పెంకుటిల్లు కట్టుకున్నాడు.

ఒకసారి ధనవంతుడి గుర్రాల బగ్గీ చక్రాల కింద, రైతు పెంచుకుంటున్న కోడి పెట్టల్లో ఒకటి పడి చనిపోయింది. ఈ విషయమై రైతు ఆయనతో తగాదా పడ్డాడు.

'కోడి ఎగిరి వచ్చి తనకుతానే చక్రాల కుర్చీ కింద పడింది. నాకూ అలా జరిగినందుకు చాలా విచారంగా ఉంది. ఆ కోడికి ఎంత ధర కడతావో కట్టు. సంతోషంగా చెల్లిస్తాను,' అన్నాడు ధనవంతుడు.

రైతు పౌరుషంగా తల విదిలించి, 'మీ దయాధర్మ బిక్ష నాకు అక్కర్లేదు,' అన్నాడు.

ధనవంతుడు అప్పటికప్పుడు వేరే కోడి పెట్టను తెప్పించి రైతుకు అందించాడు. అయినప్పటికీ రైతులో కోపం ఏ మాత్రం శాంతించలేదు. పనిలో పనిగా అతడికి ఆ ఊరి తలారి ఒకడు తోడయ్యాడు.

ధనవంతుడి కుటుంబం గ్రామాంతరం పోయినప్పుడు తలారి ఆ రైతుకు ఒక ఉపాయం చెప్పాడు.

'ఇదే తగిన సమయం. పొరుగూరు నుంచి పని మనుషులను రప్పించి ఆయన ఇంట్లో పెంచుకుంటున్న తోటను నాశనం చెయ్యించు,' అన్నాడు తలారి.

ధనవంతుడి తోట నాశనమయింది. తనకు నచ్చిన సలహా ఇచ్చినందుకు తలారికి కొంత ధాన్యం ఇచ్చాడు రైతు.

ధనవంతుడికి తన తోట నాశనమై

ఎమ్.వి.వి సత్యనారాయణ

పోయినందుకు విపరీతమైన దుఃఖం కలిగింది. తలారి ఆయన్ని కలుసుకుని, 'తోట ఇంతకు ముందు ఎలా ఉందో అలా పెంచుతాను! తమకి తోచినంత డబ్బు ఇప్పించండి!' అన్నాడు. ధనవంతుడు తేరుకున్నాడు.

తలారి తమ మనుషులతో తోటకు పూర్వ వైభవం తీసుకు వచ్చాడు. అందుకుగాను అతడికి బహుమతి బాగానే ముట్టింది. తలారి తరచుగా ధనవంతుడి భవంతి ముందు కనిపించేవాడు. రైతుకు ఇది మనస్తాపం కలిగించేది. తోట పాడు చేయించింది రైతేనని తలారి ఎక్కడ బయటపెడతాడోనని కలవరపడేవాడు. తలారి కనిపించినప్పుడల్లా ఏదో ఒక వస్తువు ముట్టచెబుతూ వచ్చాడు రైతు. తలారికి కూడా రైతు భయం పూర్తిగా అర్థమై అతడిని పీడించడం ప్రారంభించాడు.

రైతు బికారి అయిపోయాడు.

ఇలాంటి సమయంలో రైతును ధనవంతుడు తన ఇంటికి పిలిపించాడు. రైతు ఆయన్ని కలిసే సమయానికి ధనవంతుడి తోట పాడుపెట్టిన పని మనుషులు అక్కడే ఉన్నారు. రైతు చాలా గాభరా పడిపోయాడు.

ధనవంతుడు అతడిని కూర్చోమని చెప్పి, ఒక కుర్చీ చూపించాడు.

తరవాత, 'కంగారుపడకు, నీ కోడిపెట్ట చనిపోయింది. దాన్ని దృష్టిలో పెట్టుకుని నా మీద పగ పెంచుకున్నావు. మనిద్దరి మధ్యా మరింత నిప్పు రగిలించి తలారి తన పబ్బం గడుపుకుంటున్నాడు. తోట బాగయ్యింది. తర్వాత అతడు నా గుమ్మం తొక్కింది లేదు. అయితే అతడ్ని నువ్వు పదే పదే నా యింటి ముందు చూసి బెదిరిపోయి మరింత లంచం ఇచ్చి నష్టపోతున్నావని గ్రహించాను,' అన్నాడు.

రైతుకు తన తప్పు అర్థమయింది. ధనవంతుడితో స్నేహం పెంచుకున్నాడు.



# వంక - వాత

పూర్వం దత్తపురంలో, విపులుడనే యువకుడు ప్రతి చిన్న విషయానికి వంక లెడుతూ, అందరినీ వేధిస్తుంటే, ఆ దేవుడే వీడికి సరైన గుణపాఠం నేర్పాలని అందరూ మొక్కుకునే వారు, వాడి బాధ పడలేక.

ఒక రోజు పనిమీద పక్క గ్రామానికి వెళుతూ, మార్గ మధ్యంలో ఒక మహావృక్షం చూసుకుని, ఆ నీడన కాసింత నడుం వాల్చాడు విపులుడు.

పైకి చూస్తున్న వంకలరాయుడికి ఏదో స్ఫురించింది. చెట్టుకాయలు చిన్నగా ఉన్నాయి. 'హే భగవాన్! ఇంత మహా వృక్షానికి ఇంత చిన్న కాయలా? చెట్టుకి తగ్గ కాయలు ఉండొద్దూ, ఇదేం వింత సృష్టి!' అన్నాడు.

ఇంతలో అశరీరవాణి పలికింది. 'విపులా! నీ సందేహం తీరుస్తాను. ఇప్పుడు చూడు,' అంది. ఆశ్చర్యంగా చెట్టుకాయలు పెద్దవయిపోయాయి.

విపులుడు తృప్తిగా తల పంకించి, 'ఇప్పుడు బావుంది. సహేతుకంగా వుంది!' అని, ఆ వృక్షపు చల్లదనానికి హాయిగా నిద్రలోకి జారుకున్నాడు.

మాంచి నిద్రలో ఉండగా అతని మీద దబేలున ఏదో పడింది. ఉలిక్కిపడి చూస్తే, పైన గాలికి చెట్టుకాయలు రాలి కింద పడుతున్నాయి. ఇంతకు ముందు కంటే అవి పెద్దగా ఉండటం వల్ల, మీద పడుతుంటే, చెట్టుకింద విశ్రమించడం ప్రాణాంతకంగా మారింది.

విపులుడు చెట్టు కిందనుంచి పరిగెత్తి, 'స్వామీ! నాకు బుద్ధి వచ్చింది. ఇకనుండి దేనికీ అనవసరంగా వంకలెంచను - చెట్టుకాయలు యధావిధిగా చెయ్యి స్వామీ!' అంటూ ప్రార్థించాడు. చెట్టుకాయలు మామూలుగా మారి పోయాయి.

\- బి. పురుషోత్తం





# శిథిలాలయం - 32

(విషసర్పం నోట చిక్కిన శిథిలాలయ పూజారిని, శిఖిముఖీ వాళ్ళు కాపాడారు. వాళ్లకు గోపుర శకలం ఒకటి కనబడింది. శిఖిముఖి, తన అనుచరుల సాయంతో, దాని చుట్టూ ఉన్న రాళ్లను తొలగించసాగాడు. ఆ సమయంలో పెద్ద పెద్ద త్రిశూలాలు ధరించిన నలుగురు అఘోరీలు ఏనుగుల మీద వచ్చి వాళ్లను చుట్టుముట్టారు. తరవాత)

తమను చుట్టుముట్టిన ఆ నలుగురు అఘోరీలే కాక, వాళ్లకు సాయంగా మరి వంద మంది అఘోరీలు ఏను గుల మీద వస్తున్నట్లు వినగానే విక్ర మకేసరితోపాటు అందరూ భయకం పితులయ్యారు. పోరాటం లేకుండా లొంగిపోవటం అవమానకరం. అట్లని అంత మంది శత్రువులను ఈ కొద్ది మంది అనుచరులతో ఎదిరించి చూడటం ఆత్మహత్యతో సమానమవు తుంది...

విక్రమకేసరి ఇలా ఆలోచిస్తున్నం తలో శిఖిముఖి చిన్నగా అరిచి, ఎగిరి గంతేసి, 'అజితా, వీరభద్రా! వృశ్చిక నాయకుణ్ణీ, నాంగ్‌సోమ్‌నూ వెనక్కు లాక్కురండి. ఏనుగుల మీద ఉన్న అఘోరీలతో వాళ్లెలా పోరాడగలరు!' అన్నాడు.

వెంటనే అజితా వీరభద్రులు ముం దుకు పరిగెత్తి, నాంగ్‌సోమ్‌నూ, వృశ్చిక నాయకుణ్ణీ భుజాలు పట్టుకుని నిలిపి, శిఖిముఖి ఆజ్ఞ ఏమిటో వాళ్లకు చెప్పారు. వాళ్లిద్దరూ కోపంగా తమ చేతిలోని ఆయుధాలను అఘోరీల కేసి ఊపి, అయిష్టంగా వెనుదిరిగి శిఖిముఖి ఉన్న చోటుకు వచ్చారు.

దాసరి సుబ్రహ్మణ్యం



శిఖిముఖి, రాళ్లు లాగుతున్న తన వాళ్లనందర్నీ పనులు ఆపమని ఆజ్ఞాపించి, 'ఈ అఘోరీల వల్ల మనకెలాంటి హానీ కలగదు. గోల్‌భరా గ్రామానికి వచ్చే దారిలోని అరణ్యాల్లో మనం వీళ్లందర్నీ ఒకసారి కలుసుకున్నాం గదా!' అన్నాడు.

'అవును, కలుసుకున్నాం దొరా!' అన్నాడు కుంటి జాంగ్‌లా.

'ఆ మాట నిజమే! వీళ్ళ నాయకుడు ఘోరచిత్తుడు మనకు అభయ హస్తం ఇచ్చాడు. స్వయంగా ఇదిగో, ఈ రుద్రాక్షమాల నా చేతికి కట్టాడు,' అంటూ శిఖిముకి చేతినున్న మాలను అందరూ చూసేందుకు వీలుగా పైకెత్తాడు.

ఆ సరికి విక్రమకేసరికి బ్రహ్మపుత్రానదీలోయలోని మహారణ్యాల్లో లోగడ తాము అఘోరీలను కలుసుకున్న సంఘటన గుర్తుకొచ్చింది. అతడు చిరునవ్వు నవ్వుతూ శిఖిముఖి కేసి తిరిగి, 'శిఖీ! నువ్వన్నట్లు మనకు ఈ అఘోరీల నుంచి ఎలాంటి ప్రమాదం రాదు. పైగా వీళ్ల పెంపుడు ఏనుగుల సాయంతో, ఇక్కడ వున్న రాళ్లగుట్టలను తొలగించి, త్వరగా శిథిలాలయాన్ని బయటకు లాగవచ్చు,' అన్నాడు.

'నేనూ అదే అనుకుంటున్నాను. కాని, ఒక సంగతి. వీళ్లు ఆ ఘోరచిత్తుడి శిష్యులు కాకపోతే చిక్కుల్లో పడతాం. ఆ సంగతి తెలుసుకోవడం ఎలా?' అన్నాడు శిఖిముఖి.

'వీళ్ళు మహాకాలుడి భక్తులు. ఆ కాలుణ్ణి పూజించేవారికి మాత్రం హాని చేయరు' అన్నాడు కుంటి జాంగ్‌లా.

'ఆ మాట నిజం. శిఖి దొరా!' అన్నాడు నాంగ్‌సోమ్.

'వృశ్చికమాతను మించిన దైవం లేదు. ఎవరా మహాకాలుడు? మా వృశ్చిక జాతి వాళ్ళం చావనైనా చస్తాం గాని, ఈ అఘోరీల దేవుణ్ణి ఒప్పం!' అంటూ వృశ్చిక నాయకుడు రాతిగొడ్డలి ఎత్తి, తన జాతి వాళ్లందర్నీ తన దగ్గరకు రమ్మని హెచ్చరించాడు.

వృశ్చిక నాయకుడి మూర్ఖత్వం, మొండితనం బాగా ఎరిగిన శిఖిముఖి, అనవసర రక్తపాతం జరగబోతున్నదని గ్రహించి, అతడితో శాంతంగా, 'వృశ్చి

కనాయకా!ఈ అఘోరీల విషయంలో నువ్వేమీ ప్రమేయం పెట్టుకోనవసరం లేదు.నువ్వలా చూస్తూ ఉండు,' అని చెప్పి, రుద్రాక్షమాల ఉన్న చేతిని పైకెత్తి, 'ఘోరచిత్తుడికీ జే! జై, మహా కాళా!' అంటూ పెద్దగా కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే ఏనుగులపై ఉన్న నలుగురు అఘోరీలూ త్రిశూలాలను దించి, 'జై మహాకాళా!' అని అరిచారు. తరవాత శిఖిముఖీ వాళ్లను సమీపించారు.

వాళ్లలో ఒకడు శిఖిముఖి కేసి, విక్రమ కేసరి కేసి అనుమానంగా చూస్తూ, 'ఇందులో ఏమీ మోసం లేదు కదా? మీ నాయకుడు పూజారి మహా జిత్తులమారి అని విన్నాం. వాడెక్కడ? మా గురువుగారైన ఘోరచిత్తుడి పేరు మీ కెవరు చెప్పారు?' అని అడిగాడు.

శిఖిముఖి, అఘోరీలకు నమస్కరించి, 'మేము శిథిలాలయ పూజారి అనుచరులం కాము. వాడు మాకు ప్రబల విరోధి. ఘోరచిత్తుడు స్వయంగా నాచేతికి కట్టిన రుద్రాక్షమాల ఇదిగో!' అంటూ చేతిన ఉన్న మాలను చూపాడు.

అఘోరీలు ఆశ్చర్యపోతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. వాళ్లలో ఒకడు పక్కన ఉన్న వాడితో, 'ఇది వింతగా లేదా? మనం శత్రువుల్ని వేటాడవస్తే, వాళ్ళు మనకు మిత్రులం అని చెబుతున్నారు. ఆ రుద్రాక్షమాల సంగతి నమ్మదగిందేనా?' అన్నాడు.



ఆ ప్రశ్నకు రెండవ అఘోరీ అరచేత్తో నుదుటి మీద కొట్టుకుని, 'ఈ అనుమానాలతో కాలయాపన జరిగిపోతున్నాది. లాభంలేదు. మన గురువునే పిల్చుకువస్తాను,' అంటూ ఏనుగును దాపుల ఉన్న మిట్టమీదికి దౌడు తీయించి, అక్కడ దానిమీద నిలబడి చేతులు ఊపుతూ పెద్దగా ఏవో కేకలు పెట్టసాగాడు.

నాలుగైదు నిమిషాలు గడిచీ గడవక ముందే, పర్వతా కారంలో ఉన్న ఒక ఏనుగు మీద వృద్ధుడొకడు మిట్ట వెనక ఉన్న పల్లంలో నుంచి మిట్ట మీదికి వచ్చాడు. అతడి వెనకగా మరి కొందరు అఘోరీలూ, ఇభ్యజాతి వాళ్లూ కాలినడకన ఏనుగు వెనగ్గా కదిలి వచ్చారు.

అంత దూరంలో ఉండే, ఏనుగు

మీద ఉన్న వృద్ధుణ్ణి గుర్తించిన శిఖి ముఖి, సంతోషంగా ఒక కేక పెట్టి, 'ఘోరచిత్తుడికీ జై!' అన్నాడు.

ఘోరచిత్తుడు తాపీగా ఏనుగును నడుపుకుంటూ శిఖిముఖీ వాళ్లున్న చోటుకు వచ్చి, అందర్నీ ఓసారి కలియజూసి, మౌనంగా ఏనుగు మీంచి దిగి, శిఖిముఖిని గట్టిగా కౌగ లించుకున్నాడు. ఆ దృశ్యం చూస్తూనే విక్రమకేసరికి తమ కష్టాలన్నీ తొలిగి పోయినవనీ, వచ్చిన పని విజయ వంతంగా నెరవేరబోతున్నదనీ, గట్టి నమ్మకం కలిగింది. అతడు ఉత్సా హంగా, 'ఘోరచిత్తుడికీ జై!' అన్నాడు. అతడి అనుచరులంతా 'జై' అంటూ ఏక కంఠంగా పలికారు.

ఘోరచిత్తుడు చిరునవ్వు నవ్వుతూ విక్రమకేసరిని సమీపించి, 'కేసరీ! మీ తాత విక్రమకేసరి గురువు మాకు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేసే అవకాశం కలిగినందుకు చాలా ఆనందంగా ఉంది. ఆయన చూడాల నుకున్న శిథిలాలయాన్ని మనవడివైన నువ్వు చూడగలిగావు. ఆ ఆలయ ప్రాంగణంలో ఉన్న అపురూప శిల్పా లూ, నిధులూ అన్నీ నీవే. ఇదుగో, భద్రకాళి పైన ఎక్కి చూడు! ఆ సంప దనంతా మోసుకుపోయేందుకు మరి కొందరు ఇభ్యుజాతివాళ్లు కూడా వస్తు న్నారు,' అంటూ విక్రమకేసరిని సునా యాసంగా ఏనుగు పైకి ఎత్తాడు.



ఏనుగుపై నుంచి విక్రమకేసరి పరి సర ప్రాంతాలను ఓసారి కలయచూ శాడు. ఇంతమంది ఇభ్యుజాతివాళ్లను ఘోరచిత్తుడు ఎలా కూడగట్టుకు న్నాడో అతడికి అర్థం కాలేదు.

కేసరి ఏనుగు మీంచి దిగి ఘోరచి త్తుడికి తన కృతజ్ఞత తెలుపుకుని, శిఖిముఖికీ, నాంగ్‌సోమ్‌కూ తాను చూసిన ఇభ్యుజాతి వాళ్లను గురించి చెప్పాడు. శిఖిముఖి క్కూడా ఆశ్చర్యం కలిగి, అతడు ఘోరచిత్తుణ్ణి ప్రశ్నిం చాడు.

'అంతా ఆ మహాకాలుడి దయ!' అంటూ ఘోరచిత్తుడు ఆకాశం కేసి చేతులెత్తి నమస్కరించి, 'మహార ణ్యంలో మిమ్మల్ని కలుసుకున్న తర్వాత, శిథిలాలయ పూజారిని గురించి మరి కొన్ని వివరాలు తెలు



‘అదెంతపని! నా వెంట మరికొన్ని మచ్చిక చేసిన ఏనుగులు ఉన్నయ్. వాటి చేత పనిచేయించటంలో సమర్థులైన ఇభ్యుజాతి వాళ్లు కొందరున్నారు,’ అన్నాడు ఘోరచిత్తుడు.

ఇంతలో ఘోరచిత్తుడి వెంట పడవలో వచ్చిన ఇభ్యుజాతివాళ్లంతా బిలబిలమంటూ అక్కడికి వచ్చారు. వాళ్లు తమ గ్రామంవాడైన నాంగ్‌సోమ్‌నూ, శిఖిముఖీ విక్రమకేసరులనూ గుర్తించారు. అందరూ వాళ్ల చుట్టూ చేరి ఆనందం పట్టలేక నాట్యం చేయసాగారు.

సుకోవటమే కాగ ఈ లంక లోని శిథిలాలయం సంగతి ఒక ఇభ్యు వృద్ధుడి ద్వారా వివరంగా విన్నాను. ఆ పూజారి దుర్మార్గుడూ, మీరూ ఇక్కడికే బయలుదేరారని తెలిసి, వాణ్ణించి మీకు ప్రమాదం రాకుండా చూసేందుకు నేనూ మరొక పడవలో నా శిష్యులతో ప్రయాణం కట్టాను. దారిలో మీ పడవ వెనక కొంచెం ఆలస్యంగా బయలుదేరి దారితప్పినా, గోల్‌భరా ఇభ్యుల పడవ తటస్థించింది. అందరం కలిసి ఈ వృశ్చిక లంక చేరాం,’ అన్నాడు.

‘మీ సహాయానికి ఎంతో కృతజ్ఞులం. ఇక్కడ ఉన్నది నిజంగా తాతకేసరి చూడాలనుకున్న శిథిలాలయం అయి ఉంటే, మనం త్వరత్వరగా దీన్ని కప్పిన రాళ్ల గుట్టలను తొలగించాలి,’ అన్నాడు శిఖిముఖి.

ఈ కోలాహలం మధ్యనుంచి ఘోరచిత్తుడు శిఖిముఖినీ, విక్రమకేసరినీ దూరంగా తీసుకుపోయి, ‘ఇంతకూ ఆ శిథిలాలయ పూజారినని చెప్పుకునే దుష్టుడు ఏమయ్యాడు? ఈ లంకలో వాడి శిష్యుల్ని ముగ్గుర్ని పట్టుకున్నాం. వాళ్లు మా దగ్గిరే బందీలుగా ఉన్నారు. తమ గురువు ఏమైందీ తెలియదంటున్నారు,’ అన్నాడు.

‘ఇంతవరకూ మీకు ఆ పూజారిని గురించి చెప్ప మరిచాం. మీరు పట్టుకున్న ఆ ముగ్గురూ వాడి శిష్యులు కాదు. బంట్లు. మా ప్రాంతాల్లోని తిమ్మగూడెం అరణ్యాలలో వాళ్లు దారిదొంగలు. డబ్బాశ చూపి ఆ దుర్మార్గుడు వాళ్లను ఇంత దూరం తీసుకువచ్చాడు. ఇక వాడు ఏమయాడంటారా? చావు బతుకుల్లో ఉన్నాడు,’ అంటూ శిఖి

ముఖి, ఘోరచిత్తుణ్ణి చెట్లకేసి తీసుకుపోయి, కొమ్మలకు కట్టిన ఉయ్యాలలో కూర్చుని ఉన్న శిథిలాలయ పూజారిని చూపించాడు.

పూజారి కళ్లు తెరిచే ఉన్నవి. కాని, ఆ మనిషిలో చలనం లేదు. పాము నోటి నుంచి అతడు బయటపడినప్పటికీ, అప్పుడు తగిలిన గాయాలు మాననందువల్ల అతడు ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడు.

శిఖిముఖి కొద్ది మాటల్లో తాము వృశ్చికలంకలో దిగిన క్షణాన్నుంచి ఇప్పటివరకు జరిగినదంతా ఘోరచిత్తుడికి చెప్పి, 'ఆ విషసర్పం నుంచి నేను కాపాడక పోతే, ఈ సరికి దాని పొట్టలో జీర్ణమై పోయి ఉండేవాడు పూజారి,' అన్నాడు.

ఆ మరుక్షణంలోనే పూజారిలో చలనం కనబడింది. అతడు చేతులు రెండూ ఎత్తి ఘోరచిత్తుడికి నమస్కరిస్తూ, 'నువ్వు మహాకాలుడి భక్తుడివి. నేను శిథిలేశ్వరి పూజారిని. ఆ విధంగా ఇద్దరం ఒకేరకం భక్తులం. నేను మరి ఎంతో కాలం బతకను. రాళ్లతో కప్పబడిన శిథిలేశ్వరిని త్వరగా వెలికి తీయించు, చూసి, ప్రాణాలు విడుస్తాను, అన్నాడు' ఈ మాటలు అంటూండగానే అతడి కళ్లనుంచి నీళ్లు ఏకధారగా ప్రవహించసాగినై.

ఘోరచిత్తుడు నాలుగైదు క్షణాల పాటు కన్నార్పకుండా శిథిలాలయ పూజారి ముఖం కేసి చూసి ఒక్కసారిగా నిలువెల్లా కంపించి పోయి, బొంగురుపోయిన గొంతుతో, 'ఇతడు ఎంత దుర్మార్గుడైనా మహాభక్తుడు! సందేహం లేదు!' అంటూ వెనుదిరిగి, తన శిష్యులతో, 'ఏనుగుల్ని తోలుకు వచ్చి ఆలయాన్ని కప్పిన రాళ్లను త్వరగా ఎత్తించవేయండి!' అని చెప్పాడు.

గురువు ఆజ్ఞ వింటూనే అఘోరీలూ, వాళ్ల వెంట వచ్చిన ఇభ్యులూ ఏనుగుల మీద ఎక్కి వాటిని ఆలయం కేసి పరిగెత్తించుకు రాసాగారు.

(ముగింపు వచ్చే సంచికలో)





# ఆచార్యుడి ఎంపిక

గుర్జార్ చక్రవర్తి కుమార్ పటల్ గురువు పటాన్‌కి తిరిగివచ్చాడు. మార్గమధ్యంలో, ఒక రాత్రి పూట అతడు ఒక వితంతువు ఇంటివద్ద విడిది చేశాడు.

ఆమె కడు పేదరాలే అయినప్పటికీ, గురువుకు ఆ ఇంట్లో సాదర సత్కారం లభించింది. ఆ ఇంట్లో ప్రతి చోటా అతడికి అపరిమితమైన ప్రేమభావం కనిపించింది. ఆ పేద వితంతువు పట్ల గురువు సోదర ప్రేమతో వ్యవహరించాడు.

మరుసటి దినం గురువు అక్కడి నుంచి ప్రయాణమైనప్పుడు ఆమె చేతితో అల్లిన పత్తి వస్త్రాన్ని అందించింది. ఆచార్యుడు దాన్ని శాలువాలాగా కప్పుకుని పటాన్‌కు పయనమయ్యాడు.

పటాన్ చేరుకోగానే ఆచార్యుడు రాజును కలిశాడు. రాజు ఆయన పట్ల విధేయత ప్రకటించి సాదరస్వాగతం పలికాడు. రాజు, రాణి ఆచార్యుడి పాదాలను కడిగి ఆయన ఆశీర్వాదం తీసుకున్నారు.

ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్థిల్లవలసిందిగా గురువు రాజును ఆశీర్వదించాడు.

తర్వాత ఆచార్యుడు ధరించిన శాలువాను చూసిన రాజు బాధపడ్డాడు. 'ఆచార్యా, ఈ వస్త్రం మీకు సరిపోవడం లేదు. రాజగురువు ధరించవలసిన వస్త్రం కాదది.'

రాజ గర్వమే రాజు చేత అలా పలికించిదని ఆచార్యుడు అర్థం చేసుకున్నాడు. 'ఈ కట్టె రక్తమాంసాలతో తయారైంది. ఈ వస్త్రం నా శరీరానికి చేసే చెడు ఏపాటిది రాజా!' అన్నాడు.

రాజు సమాధానమిచ్చాడు. 'ఆచార్య వర్యా, మీరు ఇహలోక ఆనందాలకు, భౌతిక సుఖాలకు దూరమై ఉన్నప్పటికీ, నా ఆచార్యుడు ఉత్తరీయం వంటి విలువైన దుస్తులకు బదులు ఇలాంటి హీన వస్త్రాన్ని ధరించడం చూసి నేను సిగ్గుపడుతున్నాను.'

దీపాంశు అహూజా

రాజు మాటలు వినగానే ఆచార్యుడు హేమచంద్రుడు దీర్ఘంగా నిట్టూర్చాడు. 'ఓ రాజా! మీరు వస్త్రాన్ని చూసి సిగ్గుపడు తుండవచ్చు. కాని ఈ వస్త్రం తయారీ వెనుక అనేకమంది నిరుపేదల కఠిన శ్రమ, ప్రేమ దాగి ఉంది.

కఠిన శ్రమ కోర్చి వారు పత్తి దారాన్ని తయారు చేస్తారు. దాని ద్వారా వచ్చిన అతి స్వల్ప ఆదాయంతో వారు జీవితం గడుపుతారు. తమ జీవితాన్ని గడిపేం దుకు వారు కఠిన శ్రమ చేస్తారు కాని వారి ఒక రోజు శ్రమ ఫలితాన్ని వెచ్చించి ఖరీదైన బహుమతిని ఇవ్వగలిగేంత మంచి హృదయాన్ని వారు ప్రదర్శిస్తారు.

ఇంతటి గొప్ప గుణాలనే నేను నా శరీరంపై వస్త్రం రూపంలో కప్పుకున్నాను కనుకే నేను దాన్ని చూసి సిగ్గుపడను సరి కదా గర్వపడతాను రాజా!' అన్నాడు ఆచార్యుడు.

గురువు కొనసాగిస్తూ, 'మీరు ధర్మ ప్రభువే అయినప్పటికీ, మీ రాజ్యంలో అనేక మంది ప్రజలు రోజంతా శ్రమించి నప్పటికీ తమ ఆకలిని తీర్చుకునేంత తిండి పొందలేకపోతున్నారు. వాళ్లకొచ్చే ఆదాయం అతి తక్కువ. ఈ వస్త్రం వంటి ఆధారాన్ని చూసిన తర్వాత అయినా వారి దుస్థితిని పరిశీలించవలసిన విధి మీపైనే ఉంది కదా రాజా?

నిజమైన పాలకుడు అనవసర విషయాలపై సమయాన్ని దుర్వినియోగపర్చడు సరిగదా, రాజ్య ప్రజల శ్రేయస్సు కోసమే తన సమయమంతటినీ వెచ్చిస్తాడు.

ఇది కడుపేదరికంతో నివసిస్తున్న ఒక సోదరి నాకు ప్రసాదించిన బహుమతి. అందుకనే ఇది నాకు ప్రేమ, నిరాడంబరత్వం, విశ్వాసం, కరుణను ప్రదర్శిస్తోంది. అందుకే మీరు ఇంతవరకు చెప్పిన విలువైన దుస్తుల కంటే ఇదే నా దృష్టిలో విలువైనది,' అంటూ ఆచార్యుడు ముగించాడు.

ఆచార్యుడి మాటలు ఆలకించగానే రాజు సిగ్గుతో తల దించుకున్నాడు. తనలో ఇన్నాళ్ళుగా దాగిన గర్వం, అహంకారం మటుమాయమై, విధి నిర్వహణకు సంబంధించిన బాధ్యత కొత్తగా ప్రవేశించినట్లు భావించాడు.






# గొప్ప ఇంటి విందు

ఒక గ్రామంలో ఒక జమీందారు ఉండే వాడు. ఆయన గొప్ప ధనికుడూ, అంత కన్న గొప్ప అహంకారీనూ. ఆ గ్రామంలో ప్రజలందరూ రైతులూ, కాపులూనూ. జమీందారుకు వాళ్ళ పొడ ఏమాత్రమూ గిట్టేది కాదు.

ఒక రోజు పొలాల్లో రైతులు, 'ఇవాళ నేను జమీందారుగారిని అంత దూరంలో చూశాను,' 'ఇంత దూరంలో చూశాను,' అని గొప్పగా చెప్పుకుంటూంటే, ఒక పేదకాపు విరగబడి నవ్వి, ''ఏ చెట్టు చాటునుంచో, పుట్ట చాటు నుంచో జమీం దారుగారిని చూడటం గొప్పా ఏమిటి? తలుచుకుంటే నేను జమీందారుగారింట విందుభోజనం తినగలను,'' అన్నాడు.

ఈ మాటలు విని మిగిలిన రైతులకు చాలా కోపం వచ్చింది. ''ఈ మొహమేనా జమీందారుగారింట విందు కుడిచేది? నిన్ను జమీందారుగారి గడపదాటి లోప లికి అడుగు పెట్టనివ్వరు. ప్రగల్భాలాడకు,'' అంటూ నలుగురూ నాలుగు మాటలూ అన్నారు. ''ప్రగల్భాలాడే దాకా నా కేం పని? ఉన్న మాటే చెబుతున్నాను. నేను తలుచుకుంటే ఏ పూటైనా జమీందారు గారింటికి వెళ్ళి, భోజనం చేసి రాగలను,'' అన్నాడు పేదకాపు.

''నువ్వు ఆ పని చేస్తే నీకు మూడు గరిసెల ధాన్యమూ, జత ఎద్దులూ ఇస్తాం. నువ్వు జమీందారుగారింటి భోజనం చెయ్యలేకపోతే మేం చెప్పిన పనిఅల్లా చెయ్యాలి,'' అన్నారు రైతులు. ''నాకేమీ అభ్యంతరం లేదు,'' అన్నాడు పేదకాపు. ఆ పూటే వాడు జమీందారుగారింటికి వెళ్ళాడు. తలవాకిట కావలివాళ్ళు వాణ్ణి తరిమికొట్టబోయారు.

''కొంచెం ఆగండి. నేను ప్రభువువారి కొక శుభవార్త చెప్పాలి,'' అన్నాడు కాపు.

''ఆ శుభవార్త ఏమిటో మాతో చెప్పు. మేం ఏలిన వారితో చెబుతాం,'' అన్నారు కాపలావాళ్ళు. ''ఈ శుభవార్త ప్రభువు గారితో స్వయంగా చెప్పాలి. అది మీతో చెప్పేది కాదు,'' అన్నాడు కాపు.

**25**-ఏళ్ళనాటి చందమామ కథ

జమీందారుతో నౌకర్లు కాపువాడన్న మాట చెప్పారు. జమీందారుకు కుతూహలం కలిగింది. ఈ కాపువాడు ఏదో లాభకరమైన సంగతి చెప్పటానికి వచ్చాడు. అందుచేత ఆయన వాణ్ణి లోపలికి రానిమ్మని తన నౌకర్లతో చెప్పాడు. నౌకర్లు కాపును తెచ్చి జమీందారు ముందు ఉంచారు.

"నువ్వు ఈ ప్రాంతాల వాడివిలాగే వున్నావు! ఏమిటి నువ్వు చెప్పదలచిన వార్త?'' అని జమీందారు కాపును అడిగాడు.

కాపువాడు రహస్యంగా, "గుర్రం తలకాయంత బంగారం ధర ఏపాటి ఉంటుందంటారు?'' అని జమీందారును అడిగాడు. "ఎందుకలా అడుగుతున్నావు?'' అన్నాడు జమీందారు.

'ఒక కారణం ఉండి అడుగుతున్నాను, ప్రభూ. తమకు తెలిస్తే చెప్పండి,' అన్నాడు పేదకాపు. "ఆ కారణం చెప్పమంటున్నాను,'' అన్నాడు జమీందారు.

కాపువాడు నిట్టూర్చి, "తమకు చెప్పడం ఇష్టం లేకపోతే నేను మాత్రం ఏం చెయ్యగలను? తమ సెలవైతే ఇంటికి పోయి భోజనం చేస్తాను. కడుపులో మండిపోతున్నది,'' అన్నాడు. జమీందారుకు వాడిని వెళ్ళనివ్వ బుద్ధికాలేదు. గుర్రం తలకాయంత బంగారం చెయిజారి పోనివ్వటం ఇష్టంలేక ఆయన తన నౌకర్లను పిలిచి, "వీణ్ణి తీసుకుపోయి, వెంటనే సుష్టుగా భోజనం పెట్టండి,'' అన్నాడు.

కాపువాడు రాజోపచారంగా కడుపు నిండా తిండి తిని వచ్చాక, జమీందారు వాడితో, "నువ్వు ఆ బంగార మేదో పట్టుకురా! దాని గొడవ నీ కన్న నాకు బాగా తెలుసు. నీకు బహుమానం కూడా ఉంటుందిలే !'' అన్నాడు.

"బంగారమా? నా దగ్గిర బంగారం ఎక్కడున్నది? రెండు గరిసెల ధాన్యమూ, జత ఎద్దులూ కలిసి గుర్రం తలకాయంత బంగారంతో సమానం అవునో కాదో తమరినడిగితే తెలుస్తుంది గదా అనుకున్నాను,'' అన్నాడు కాపు.

జమీందారుకు మండిపోయింది. "ఛీ, వెధవా! ఇంకో క్షణం ఇక్కడున్నావంటే నిన్ను చంపేస్తాను. మారు మాట్టాడకుండా పో!'' అన్నాడు కాపుతో. కాపు వెళ్ళిపోయి, రైతుల దగ్గిర పందెం గెలుచుకున్నాడు.



# సురేఖ గడుసుతనం

తల్లి తండ్రులకు ఒక్కగానొక్క కూతురైన ఐదేళ్ళ సురేఖ చాలా తెలివిగల పిల్ల. ఎప్పుడూ చురుగ్గా, అల్లరిగా ఇల్లంతా తిరుగుతూ ఉండేది.

ఒకనాటి రాత్రి సురేఖ తల్లి, ''అమ్మా సురేఖా, పెరట్లోకి వెళ్ళి చీపురు తీసుకురా తల్లీ,'' అన్నది.

''పెరట్లో చీకటిగా ఉంటుంది. నాకు భయం. నేను వెళ్ళను,'' అన్నది సురేఖ.

తల్లి చిన్నగా నవ్వుతూ, ''చీకటిని చూసి భయపడకూడదు చిట్టీ. అక్కడ విఘ్నేశ్వరుడు ఉంటాడుగా. నేకేం భయం? అన్ని వేళలా విఘ్నేశ్వరుడు అందరికీ తోడుగా, రక్షణగా ఉంటాడు కదా?'' అన్నది.

రేఖ తల్లికేసి రెప్పలల్లాడిస్తూ చూస్తూ, ''నిజంగానే విఘ్నేశ్వరుడు అక్కడ ఉన్నాడంటావా?'' అని అడిగింది ఆశ్చర్యంగా.

''తప్పకుండా ఉన్నాడు. అక్కడేకాదు; అన్ని చోట్లా ఉన్నాడు. వేడుకున్నప్పుడు మన అవసరాలు తీర్చడానికి సిద్ధంగా ఉంటాడు,'' అన్నది తల్లి కూతురికి ధైర్యం కలిగించడానికి.

సురేఖ కొంతసేపు మౌనంగా ఆలోచించి, చరచరా పెరటి తలుపు వరకు వెళ్ళి, దాన్ని కొద్దిగా తెరిచి, చేయి వెలుపలికి చాపి, ''విఘ్నేశ్వరా, నువ్వు నిజంగానే అక్కడ గనక ఉన్నట్టయితే, అక్కడున్న చీపురు కాస్త తీసి అందివ్వవూ?'' అన్నది.





# తీపి మిఠాయి

శిఖి తన బ్యాగ్‌ని సోఫాపైకి విసిరి, వంట గదిలోకి వెళ్లి కేక పెట్టింది. 'అమ్మా నాకు చచ్చేంత ఆకలిగా ఉంది' అన్నది. 'వెళ్లి కాళ్లూ చేతులు కడుకుకని దుస్తులు మార్చుకుని రా,' అన్నది అమ్మ నవ్వుతూ. శిఖి వంటగదికి వెళ్లి చైనా జాడీలోంచి తీపి మిఠాయి అందుకోవడానికి ప్రయత్నించింది. కాని అమ్మ శిఖిని వెనక్కు లాగి స్నానాలగదిలోకి నెట్టింది. 'ముందు కడుక్కునిరా' అంటూ ఆమె తలమీద మొట్టింది.

శిఖి దుమ్ము పట్టిన ముఖాన్ని చేతులతో తడుముకుంటూ స్నానాలగదికి వెళ్లింది. సబ్బుతో తన ముఖాన్ని, చేతుల్ని కడుక్కుంది. 'త్వరగా రావే బయటకు నీటితో ఆడుకోకు' అంటూ అమ్మ అరిచింది.

శిఖి తల్లి మాట పట్టించుకోకుండా తన ఆటల్లో తాను ఉండిపోయింది. చివరకు ఆమె స్నానాల గదినుంచి బయటపడి వంటగదిలోకి వచ్చింది. కడుక్కోవడం పూర్తయిందమ్మా, తినడానికి ఏదయినా పెట్టు, అంటూ తొందరచేసింది.

అమ్మ తన చీర కొంగుతో ముఖం తుడిచి నవ్వింది. కూతురిని కూర్చోబెట్టి పళ్లెంలో అన్నం పెట్టి ఆమె ముందుంచింది. పప్పు, అప్పడం; ఆమెకిష్టమైన తీపి మిఠాయి కూడా ఇచ్చింది. తీపిమిఠాయిని చివరలో తినాలనే దుగ్ధతో శిఖి పప్పన్నం త్వరత్వరగా ముగించింది. తీపి మిఠాయిని తన చిన్ని చేతివేళ్లతో అందుకుని చప్పరించసాగింది. నోట్లో పెట్టుకుంటే చాలు కరిగిపోతోంది మిఠాయి. అమ్మ చేసే మిఠాయి అంటే ఆమెకు చాలా ఇష్టం.

ఆదివారాల్లో అపరాహ్న వేళల్లో అమ్మ కునుకు తీస్తున్నప్పుడు శిఖి మెల్లగా వంటగదిలోకి వెళ్లి చైనా పింగాణి జాడీ వద్దకెళ్లి తీపిమిఠాయిని లాగించేంది.

జాడీ వద్దకు వెళ్లడానికి ఆమె కొన్నిసార్లు కొయ్య బల్ల, ప్లాస్టిక్ బైస్కిల్ కూడా ఉపయోగించేది. ఉయ్యాలలో లేదా

విజయ కందపాల్



పెరడులో కూర్చుని తన మునివేళ్లతో ఆ తీపి మిఠాయి బద్దలను నిమరడం అంటే ఆమెకు చాల ఇష్టం. ఒక్కోసారి అమ్మకు కాస్త నలతగా ఉండి సాయానికి రమ్మని పిలిస్తే శిఖి అస్సలు స్పందించేది కాదు. ఏదైనా సమాచారం కోసం లేదా గ్లాస్ నీళ్లు తెమ్మని అమ్మ పిలిచేది కాని తాను చదువులో మునిగిపోయి ఉన్నానని, అలాంటి పనులు తననే చేసుకోమని శిఖి బదులిచ్చేది.

అలాంటి సందర్భాల్లో అమ్మ నిట్టూర్చి తన పనులు తానే చేసుకునేది. శిఖి ఏదైనా తప్పు చేసినప్పుడు ఆమెను పట్టుకోవడానికి వస్తే తన కొయ్య మంచం వెనుక శిఖి దాక్కునేది.

ఒక రోజు, బడి నుంచి తిరిగి వస్తున్నప్పుడు, శిఖి తన మోకాలు రుద్దుకోవడం ప్రారంభించింది. మోకాలిపై రక్తం వస్తోంది. చాలా బాధగా ఉంది. ఆమె ఇంటికి చేరుకుని తలుపు తట్టి అమ్మా నాకు దెబ్బ తగ్గిలింది అని అరిచింది. ఇంట్లోంచి సమాధానం రాలేదు. మళ్లీ అరిచింది కాని అమ్మ స్పందించలేదు.

శిఖి బంగారూ, రామ్మా, అని పిలిచాడు నాన్న. అమ్మను ఆపరేషన్ కోసం ఆసుపత్రిలో చేర్చావము. ఆదివారం ఆమెను కలుద్దాము సరేనా, కానీ నువ్వెందుకు ఏడుస్తున్నావు? అనడిగాడు.

దెబ్బ తగిలింది నాన్నా, చెప్పింది శిఖి కన్నీళ్లు కారుస్తూ.

అయ్యో, ఎక్కడయినా పడ్డావా? రా, రా, అంటూ నాన్న శిఖిని స్నానాలగదికి తీసుకెళ్లి ఆమె మోకాళ్లు కడిగి దుస్తులు మార్పించాడు.

గాయంపై పురుగు ముట్టకుండా పూత మందు పూసి బ్యాండేజీతో కట్టు కట్టాడు.

అమ్మ ఎప్పుడొస్తుంది నాన్నా? అని అడిగింది శిఖి అయోమయంగా చూస్తూ.

పదిరోజులు పడుతుంది తల్లీ, చెప్పాడు నాన్న.

సరే కాని వెళ్లి నీ భోజనం ముగించుకుని రా, అంటూ సంభాషణ ముగించాడు. వంటగదిలో పళ్లెంలో కాస్త అన్నం, పప్పు, కాస్త తీపిమిఠాయి బద్ద, గ్లాసు పాలు ఉన్నాయి. ఆరోజెందుకో తీపి మిఠాయి బద్దను ఇష్టంగా తినలేకపోయింది శిఖి. ఆమె తన ప్రపంచం నుంచి బయటపడింది. ఎక్కడో తప్పు చేసినట్లు భావన కలిగింది.

నేను అమ్మను ఎప్పుడూ పట్టించుకోలేదు. అమ్మ మాట వినలేదు. అమ్మ తిరిగి రాకుంటే..? శిఖికి ఎటూ పాలుపోలేదు. నాన్న తోడుగా ఉన్నప్పటికీ ఆ రాత్రి శిఖికి నిద్ర పట్టలేదు. మరుసటి

రోజు నాన్న బడికెళ్లటానికి శిఖిని సిద్ధం చేశాడు. నాన్న ప్రతి రోజూ శిఖి వాళ్లమ్మ వద్దకు వెళ్లేవాడు. అమ్మలేకుండా శిఖికి ఏమాత్రం సహించడం లేదు. బొమ్మతో ఆడుకోవాలనిపించడం లేదు, కథల పుస్తకాలు చదవటం లేదు. పెరడులో మామిడి చెట్టుపైకెక్కి ఊగాలని, ఆడుకోవాలని కూడా ఆమెకు అనిపించడం లేదు. తనకెంతో ఇష్టమైన తీపిమిఠాయిని కూడా ఆమె ఇష్టపడలేదు. చైనా పింగాణి జాడీ ఆమెను రారమ్మని పలుసార్లు పిలిచింది. అక్కడ ఆమెను మందలించడానికి ఎవరూ లేరు. మిఠాయిని తీసుకుంటుండాగా చూడడానికి అమ్మ కూడా లేదు. కాని జాడీ మూత తెరవలేకపోయింది శిఖి.

ఆదివారం అపరాహ్నం తర్వాత శిఖి నాన్నతో కలిసి అమ్మను కలిసేందుకు వెళ్లింది. శిఖిని చూడగానే అమ్మ ముఖం వికసించింది. ఆమెను చెంపపై ముద్దు పెట్టుకుని హత్తుకుంది.

ఎలా ఉన్నావు తల్లీ? అడిగిందామె.

కళ్లలో నీళ్లు తారాడుతుండగా శిఖి మాట్లాడలేకపోయింది.

ఈ సంవత్సరం నీకు కొత్తరకం మిఠాయి చేసిపెడతాలేమ్మా అంది శిఖి వాళ్లమ్మ. శిఖి మెల్లగా తలూపింది. ఇంటికి వచ్చిన తర్వాత శిఖి ఆ రాత్రంతా ఏడుస్తూనే ఉంది. నాన్న ఆమెను ఓదార్చడానికి ప్రయత్నించాడు. ఆమె తల నిమురుతూ, అమ్మ త్వరలోనే వచ్చేస్తుంది తల్లీ, నిద్రపో మరి, అన్నాడు.

ఒక అపరాహ్నం తర్వాత, శిఖి తన అత్తతోపాటు ఇంటిలో ఉన్నప్పుడు, తలుపు తట్టిన శబ్దం వచ్చింది. తలుపు తీసిన శిఖి ముఖం ఆనందంతో వెలిగిపోయింది. అమ్మ, అమ్మ వచ్చేసింది. అమ్మ తిరిగొచ్చేసింది. ఒక్కసారిగా అమ్మను కావిలించుకుంది. అమ్మకూడా శిఖిని హత్తుకుని నవ్వింది.

మొట్టమొదటిసారిగా శిఖి గ్లాసు నీటిని తీసుకొచ్చి అమ్మకు ఇచ్చింది. అమ్మ శిఖిని ముద్దుపెట్టుకుంటూ నీళ్లు తాగింది. నా బిడ్డ చాలా మంచిది, అని చెప్పిందామె. శిఖి కళ్లవెంబడి నీళ్లు. ఉబికి వస్తున్న కన్నీటిని తుడుచుకోవడానికి ప్రయత్నించలేదు శిఖి. బావురుమని ఏడుస్తూ అమ్మ ఒడిలో ఒదిగిపోయింది.





# రొట్టెలో నగలు

ప్రజలు తమకు కలిగే అదృష్టాన్ని ఎలా వాడుకుంటారో తెలుసుకోవాలనుకున్న రాజు, ఒకరోజు రాజభవనంలోని వంటశాలలో రొట్టెలు కాల్చేవాణ్ణి పిలిచి రెండు అందమైన రొట్టెలు తయారుచేయమన్నాడు. ఒకదానిని మామూలుగా తయారుచేసి, రెండవదానిలోపల విలువైన నగలు దాచమన్నాడు.

వారానికోసారి ఉదయం పూట ఒకరాజోద్యోగి, పేదవారికి దానధర్మాలు చేయడం ఆనవాయితీ. అలా ఆరోజు వచ్చిన రాజోద్యోగిని పిలిచి, రాజు ఆ రెండు రొట్టెల గురించి చెప్పి, నగలు దాచిన రొట్టెను చూపుతూ, "దీనిని పాత్రుడైన వాడికి దానం చెయ్యి. రెండవదాన్ని నీ వద్దకు భిక్షకువచ్చే వారి కెవరికైనా ఇవ్వు," అన్నాడు.

ఆ రోజు ఇద్దరు భిక్షకు వచ్చారు. వారిలో ఒకడు గొప్ప సాధువు. రెండవవాడు మామూలు బిచ్చగాడు. రాజోద్యోగి నగలు దాచిన రొట్టెను సాధువుకిచ్చి, రెండవదాన్ని మామూలు బిచ్చగాడికిచ్చాడు. సాధువు రొట్టెను అందుకోగానే, అది బరువుగా ఉండడంతో ఆశ్చర్యంగా చూశాడు. రొట్టె సరిగ్గా కాలినట్టు లేదనే నిర్ణయానికి వచ్చాడేమో మరి. పక్కనున్న బిచ్చగాడికేసి ఆప్యాయంగా చూస్తూ, "మిత్రమా, ఈ రొట్టె కాస్త ఎక్కువ బరువుగా ఉన్నట్టుంది. నీచేతిలో ఉన్నదానికన్నా ఇది కొంచెం పెద్దదనుకుంటాను. ఈ పూట నాకు అంత ఆకలిగా లేదు. మనం రొట్టెలను మార్చుకుందామా?" అన్నాడు. బిచ్చగాడు మరేమీ మాట్లాడకుండా, తన రొట్టెను సాధువు చేతిలో పెట్టి, ఆయన రొట్టెను తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ దృశ్యాన్ని చూసిన రాజు, "సాధువు నగల వ్యామోహంలో పడకూడదన్నది దేవుడి సంకల్పంకాబోలు! సాధువును ధనవంతుడిగా మార్చడం దేవుడికి సమ్మతం కాదేమో!" అనుకున్నాడు. అయినా, సాధువు తన రొట్టెను బిచ్చగాడికి ఇస్తున్నప్పుడు ఆయన ముఖంలో కనిపించిన చిరునవ్వును రాజు మరవలేక పోయాడు.

అయినా, ఆ నవ్వు రాజులో తీరని ఉత్సుకతను రేకెత్తించింది. వెంటనే ఇద్దరు

ఎం.డి

గూఢచారులను పిలిచి, రొట్టెలను పుచ్చుకుని వెళ్ళిన ఇద్దరినీ రహస్యంగా అనుసరించి వెళ్ళి, వాళ్ళు ఏం చేస్తారో తెలుసుకుని రమ్మన్నాడు. సాయంకాలానికి ఇద్దరు గూఢచారులూ వచ్చి జరిగిన సంగతులు రాజుగారికి విన్నవించారు:

సాధువు రొట్టెను తీసుకుని తిన్నగా తన కుటీరానికి వెళ్ళాడు. అంగీనీ, పెట్టుడుగడ్డాన్నీ తీసి పక్కన పెట్టి; రొట్టెనూ, దానితో పాటు తెచ్చుకున్న వంటకాలనూ తృప్తిగా తిన్నాడు. మళ్ళీ పెట్టుడుగడ్డాన్ని తీసి ముఖానికి తగిలించుకుని, అంగీని ధరించి సాధువులా భిక్షానికి బయలుదేరాడు.

బిచ్చగాడు తన గుడిసెకు చేరి రొట్టెను ముక్కలుగా కోయబోయి, అందులోని నగలను చూసి అమితాశ్చర్యం చెందాడు. దానిని చూసిన అతడి వెళ్ళాం, ''ఆహా, ఇంతకాలానికి దేవుడు కరుణించాడు. ఇవన్నీ, నావే,'' అన్నది.

అయితే, బిచ్చగాడు తొందర పడకుండా, ''ఒక సాధువు దీనిని నాకిచ్చాడు. నేను ఆ గొప్ప వ్యక్తి దగ్గరికి వెళ్ళి ఈ నగలను పొరబాటున రొట్టెలో పెట్టారేమో తెలుసుకోవాలి. ఒకవేళ దీనిని ఎవరైనా ప్రభువుల ఇంటి నుంచి దొంగిలించి రొట్టెలో దాచారేమో చూడాలి. అలాకాక ఆ గొప్ప వ్యక్తే దీనిని సాధువుకు దానంగా ఇచ్చి ఉన్నట్టయితే ఇది ఆ సాధువుకే చెందాలి కదా? ఇవన్నీ ఏవీ కావనుకుంటేనే దీనిని మనం ఆశించవచ్చు. ప్రభువులే దయతలచి మనకు ఇస్తే, మనం కొన్ని నగలు తీసుకుని, ఇరుగు పొరుగుకు కొన్ని ఇద్దాం,'' అన్నాడు భార్యతో. ఆ తరవాత నగలను తీసుకుని, రాజోద్యోగి దగ్గరికి వెళ్ళి సంగతి చెప్పాడు. ఉద్యోగి అతన్ని రాజు వద్దకు తీసుకువెళ్ళాడు. రాజు అతడి నిజాయితీకి సంతోషించి, ఆ నగలను అతనికే ఇచ్చి, మరిన్ని కానుకలతో సత్కరించాడు.

''సాధువుగా నటించిన ఒక మోసగాడి చేతికి దక్కకుండా దానిని దేవుడు ఒక పాత్రుడికే అందించాడు. అయితే, ఈ సంఘటన నుంచి నేను నేర్చుకున్న గుణపాఠం అమూల్యమైనది. వాళ్ళు రొట్టెను మార్చుకోవడం చూడగానే, నాకు తోచిన వివరణతో తృప్తి పడి సరిపుచ్చుకుని వుంటే అసలు నిజం బయటపడి వుండేదికాదు. అంటే, మనకు తెలిసినవే నిజమన్న భావనతో తృప్తి చెంది ఊరుకోవడం ఏమాత్రం భావ్యం కాదు,'' అన్నాడు వివేకి అయిన ఆ రాజు సభికులతో.



# కెరీర్ అంటే?



క్లౌన్ డాక్టర్లు అంటే మీకు తెలుసా? ఈ పదం వింటూనే తమాషాగా అనిపిస్తుంది కాని వీరు చేసే పని చాలా గొప్పది. ఈపేరు సూచిస్తున్నట్లుగానే క్లౌన్ డాక్టర్లు అంటే మెడికల్ డాక్టర్లు కాదు కానీ వృత్తిరీత్యా వైద్య సేవలిందిస్తారు. సాంప్రదాయేతర మందులను వీరు నిర్వహిస్తారు. వీరు రాసే ప్రిస్క్రిప్షన్ బాగా నవ్వు తెప్పిస్తుంది మరియు సంతోషం కలిగిస్తుంది. సంతోషం కంటే నొప్పిని తగ్గించేది మరేమీ లేదని వీరి నమ్మిక. న్యూయార్క్ లోని మైఖేల్ క్రిస్టెన్‌సెన్ ద్వారా ప్రారంభించబడిన బిగ్ యాపిల్ సర్కస్ క్లౌన్ కేర్ యూనిట్ అని పిలుబడిన కార్యక్రమం కింద 1986లో ఆసుపత్రులలో ప్రొఫెషనల్ క్లౌన్ డాక్టర్లు తమ పని ప్రారంభించారు.

క్లౌన్ డాక్టర్లు అనే భావన భారత్‌లో ప్రాచుర్యం పొందింది. ఫ్రెంచ్ క్లౌన్ డాక్టర్ల బృందమొకటి బెంగళూరు సందర్శించి ఈ భావనను పరిచయం చేయడానికి పలు వర్క్‌షాపులను నిర్వహించడంతో ఇది బాగా ప్రచారంలోకి వచ్చింది. క్లౌన్ డాక్టర్ల ప్రధాన లక్ష్యం ఏదంటే రోగులలో నొప్పికి సబంధించిన దృక్పథాన్ని మార్చడమే. సంగీతం నుంచి మిమిక్రీ వరకు, నాట్యం నుంచి నాటకం వరకు ఎలాంటి కళారూపంతో అయినా వీరు సౌకర్యంగా అనుభూతి పొందగలగాలి. కాబట్టి కళారూపాలలో ఏదో ఒకదానితో మీకు పరిచయం ఉంటే మీకూ ఒకక్లౌన్ డాక్టర్ కావచ్చు. అతడు లేదా ఆమెకు ఊహాశక్తి, సృజన ఉండి, ఇతరులను నవ్వించగల శక్తి ఉంటే అలాంటి వారు ఎవరైనా క్లౌన్ డాక్టర్ కావచ్చు. రోగుల నొప్పి తగ్గించడానికి వీళ్లు నవ్వును ఒక నొప్పి నివారణ సాధనంగా ఉపయోగిస్తారు. నవ్వు, హాస్యం అనేవి ఒత్తిడిని తగ్గించడంలో సహాయపడతాయి. తక్కువ ఒత్తిడితో ఉన్న రోగులు వేగంగా వ్యాధి నుంచి బయటపడతారు. విదేశాలలో సమృద్ధిగా అవకాశాలు ఉన్నప్పటికీ భారతదేశంలో ఈ క్లౌన్ డాక్టర్ వేదికలు ఇప్పుడిప్పుడే ప్రారంభమవుతున్నాయి. ఈ వృత్తిలో ఉన్నవారికి వేతనాలు ఇంకా రూపొందలేదు. మన దేశంలో వాలంటీర్ ప్రాతిపదికన అతి తక్కువ పారితోషకంతో ఈ సేవలు అందిస్తున్నారు. ఆస్ట్రేలియాలో హ్యూమర్ ఫౌండేషన్ అనే పేరుతో ఒక కార్యక్రమం ప్రజారంజకంగా నిర్వహించబడింది. (http://clowndoctors.org.au/home.html)




– సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 46

(పదహారేళ్ళు లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -46అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. డిసెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. ఫిబ్రవరి 2013 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## పత్రికలు

1. కాగితం కనిపెట్టకముందు రాయడానికి ఉపయోగించిన కాగితం లాంటి వస్తువును పేర్కొనండి.
2. మొట్టమొదటి ఇంగ్లీష్ వార్తాపత్రిక ఎక్కడ ప్రచురించబడింది?
3. భారతదేశంలో ప్రచురించబడిన తొలి వార్తా పత్రిక ఏది?
4. ప్రపంచంలో అతి పెద్ద పత్రికను ప్రచురించిన దేశం ఏది?
5. ఒరిగమి అంటే ఏమిటి?
6. జిఎస్ఎమ్ పేపర్ అంటే ఏమిటి?
7. వాడి వదిలేసే కాగితం కప్పులు ఎప్పుడు కనిపెట్టారు?
8. కాగితం ఎప్పుడు, ఎక్కడ కనిపెట్టబడింది?
9. భారతదేశంలో తొలి పేపర్ మిల్లు ఎక్కడ స్థాపించారు?
10. భారతదేశంలో కాగితపు కరెన్సీని ఎవరు ప్రవేశపెట్టారు?
11. మిల్‌బ్రూక్ అంటే ఏమిటి?
12. డెయిన్‌కింగ్ అంటే ఏమిటి?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-43 సమాధానాలు:

1.కేసరి; 2.క్విట్ ఇండియా ఉద్యమం; 3.జతిన ముఖర్జీ; 4.సింగపూర్‌లో, 1943లో; 5.జి.వి. మావ్లంకర్; 6.సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి; 7.ఇంక్విలాబ్ జిందాబాద్; 8.సైమన్ కమిషన్; 9.మాల్దా; 10.బాల్ గంగాధర్ తిలక్.

*August'12 Winners: 1. Krithika, Chennai. 2. P. Venkatalakshmi, Kovilpatti. 3. B. Saisuvarchala Neharika, Chilakalapudi.*



# నవ్వుల పువ్వులు

హెలికాప్టర్ నుంచి క్షేమంగా దిగడానికి 11మంది తాడుపై వేలాడుతుంటారు. వీరిలో 10 మంది పురుషులు, ఇద్దరు మహిళలు. వీరిలో ఒకరిని తప్పించకపోతే తాడు తెగిపోయి అందరూ చనిపోవటం ఖాయం. కాని తమలో ఎవరు తాడు విడిచిపెట్టాలో వాళ్లు నిర్ణయించుకోలేకపోతారు. చివరకు వారిలో ఒక మహిళ ఉద్వేగంగా మాట్లాడుతూ అందరికోసం తను బలవడానికి సిద్ధమని చెప్పింది. ఎందుకంటే మహిళలు తమ భర్తలకోసం, పిల్లలకోసం సమస్తమూ ధారపోస్తారని చెప్పిందామె. అంతే తాడుపై వేలాడుతున్న పురుషులంతా ఒక్కసారిగా చప్పట్లు కొట్టేశారు.





ఒక ముసలాయన కొంతమంది జాలర్లు మూడు చేపలను పట్టి వాటిలో రెండు పెద్ద చేపలను తిరిగి నీటిలోకి విడిచిపెట్టడం చూశాడు. పెద్దవాటిని వదిలేసి చిన్న చేపను అట్టిపెట్టుకున్నారు ఎందుకని అడిగాడు. బాబయ్యా మా ఇంట్లో చిన్న పెనము మాత్రమే ఉంది మరి, అన్నాడు జాలరి.



రెస్టారెంటులో మనిషి: వెయిటర్ ఎంత కాలం నుంచి ఇక్కడ పనిచేస్తున్నావు?
వెయిటర్: రెండు నెలలనుంచీ పని చేస్తున్నానండీ.
రెస్టారెంటులో మనిషి: అంటే నా నుంచి ఆర్డర్ తీసుకున్నది నువ్వు కాదన్నమాట.



ఖైదీ: డాక్టర్ ఇటు చూడండి!
మీరు ఇప్పటికే నా ప్లీహం, టాన్సిల్స్, ఎడినాయిడ్ గ్రంథులతో పాటు నా కిడ్నీలలో ఒక దాన్ని కూడా తొలగించేశారు. ఇక్కడినుంచి నన్ను ఎప్పుడు పంపించేస్తారని చూస్తున్నాను.
డాక్టర్: ఉండు, కొంచె కొంచెంగా పంపుతాగా..



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I didn't understand | You study well. |
|---|---|---|
| Telugu | నాకు అర్థం కాలేదు. | నీవు బాగా అధ్యయనం చేస్తావు. |
| Hindi | मैं नहीं समझा/समझी<br>మైన్ నహీన్ సంఝూ /సంఝే. | तुम अच्छे से पढ़ो।<br>తుమ్ అచ్చే సే పఢో. |
| Tamil | எனக்குப் புரியவில்லை.<br>ఎనక్కు పురియవిల్లయ్. | நீ நன்றாக படிக்கிறாய்.<br>నీ నన్రాగ పడిక్కిరయ్. |
| Bengali | আমি বুঝতে পারিনি।<br>ఆమి బుజ్‌టె పారిని. | তুমি ভাল করে পড়।<br>తుమి బాలో కొరెయ్ పాఢ్హో. |
| Marathi | मला समजत नाहीये.<br>మల సమాజత్ నహీయె. | चांगला अभ्यास कर.<br>చంగల అభ్యాస్ కర్. |
| Kannada | ನನಗೆ ಅರ್ಥವಾಗಲಿಲ್ಲ.<br>ననగె అర్థవాగిలిల్ల. | ನೀವು ಚೆನ್ನಾಗಿ ಓದಿ.<br>నీవు చెన్నాగి ఓడి. |
| Odia | ମୁଁ ବୁଝିପାରି ନଥିଲି।<br>మున్ బుజ్హీపారి నథిలి. | ତୁମେ ଭଲ ଭାବରେ ପଢ଼।<br>తుమె బాల భాబరెరె పడా. |
| Gujarati | મને સમજાયું નહીં<br>మనె సమ్‌జాయుమ్ నహీన్. | તમે બરાબર અભ્યાસ કરો<br>తమె బరాబర అభ్యాస్ కరో. |
| Assamese | মই বুজি পোৱা নাছিলো।<br>మోయి బుజి పువా నాసిలు. | তুমি ভালকৈ অধ্যয়ন কৰা।<br>తుమి భాలొక్కొయి అద్యన్ కొరా. |
| Malayalam | എനിക്ക് മനസ്സിലായില്ല.<br>ఎనిక్కు మనసిలియిల్ల. | നീ നന്നായി പഠിക്കൂ.<br>నీ నన్నయి పడిక్కో |
| Sanskrit | न मया अवगतम् ।<br>న మయ అవగతమ్. | सम्यक् अध्ययनं करोतु।<br>సమ్యక్ అధ్యయనం కరోతు. |



| English | I have started. | What is the result? |
|---|---|---|
| Telugu | నేను మొదలు పెట్టాను. | ఫలితం ఏమిటి? |
| Hindi | मैंने शुरू कर दिया है।<br>మైనె షురూ కర్ దియా హై. | परिणाम क्या है?<br>పరిణామ్ క్యా హై? |
| Tamil | நான் ஆரம்பித்து விட்டேன்.<br>నాన్ ఆరంభిత్తు విట్టాయెన్. | முடிவு என்ன?<br>ముదివు ఎన్నా? |
| Bengali | আমি আরম্ভ করে দিয়েছি।<br>ఆమి ఆరంభో కొర దియెచ్ఛి. | ফলটা কি হয়েছে?<br>ఫల్ తా కి హోయెచ్ఛె? |
| Marathi | मी सुरू केला आहे.<br>మి సురు కెలా ఆహె? | निकाल काय लागला आहे?<br>మగిల్ వర్షిపెక్ష చాంగ్ల అహె. |
| Kannada | ನಾನು ಪ್ರಾರಂಭಿಸಿದ್ದೇನೆ.<br>నాను ప్రారంభిసిద్దెనె. | ಫಲಿತಾಂಶ ಏನು?<br>ఫలితాంశ ఏను? |
| Odia | ମୁଁ ଆରମ୍ଭ କରି ଦେଇଛି।<br>ముున్ ఆరంభ కరి దెయిచ్ఛి. | ଫଳ କଣ ହୋଇଛି?<br>ఫల కన్ హొయిచ్ఛి? |
| Gujarati | મેં શરૂઆત કરી.<br>మె షరూత్ కరి. | પરિણામ શું છે?<br>పరిణామ షున్ ఛె? |
| Assamese | মই আৰম্ভ কৰিলো।<br>మొయి ఆరొంభొ కొరిలు. | ফলাফল কি.<br>ఫలాఫల్ కి? |
| Malayalam | ഞാൻ തുടങ്ങിക്കഴിഞ്ഞു.<br>న్జాన్ థుడంగిక్కళింజు. | ഫലം എന്താണ്?<br>ఫలమ్ ఎంతను? |
| Sanskrit | मया पूर्वमेव आरब्धम्।<br>మయా పూర్వమేవ ఆరంభమ్. | कः फलितांशः।<br>కః ఫలితాంశః? |

## ధోవతికి అధికారిక గుర్తింపు




భారతదేశంలో పురుషులు ధరించే సాంప్రదాయిక వస్త్రం ధోవతిని ఇకపై న్యాయస్థానంలో న్యాయవాదులు కూడా ధరించవచ్చు. రాజస్థాన్ హైకోర్టులో ఒక న్యాయమూర్తి ఈ విషయంపై 25 పేజీల తీర్పు ప్రకటించాడు. న్యాయవాది వేద్ పాల్ శాస్త్రి ఒకరోజు కోర్టుకు తెల్ల ప్యాంట్‌కు బదులుగా ధోవతి ధరించి రావడంతో ఈ కథ మొదలైంది. కోర్టులో వస్త్రధారణ నిబంధనలకు విరుద్ధంగా వ్యవహరించినట్లు అవుతుందని వేద్ పాల్ సీనియర్ దీన్ని వ్యతిరేకించాడు. అయితే 1961 బార్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా డ్రెస్ కోడ్ ప్రకారం ధోవతి ధరించవచ్చని వేద్ పాల్ ఎత్తిచూపాడు. ఆరుగంటల తీవ్ర వాదోపవాదాల తర్వాత న్యాయవాదులు ధోవతిలను ధరించవచ్చని న్యాయస్థానం అంగీకరించింది.

ధోవతి అనేది వ్యక్తికి గౌరవాన్ని కలిగిస్తుంది. పైగా ప్రాచీన కాలం నుంచి ఇది వాడుకలో ఉంది కూడా.

## చిరుతతో పోరాడిన కుక్క



పింటో అనే సాహస శునకం అడివిలో ఒక చిరుతపై దాడిచేసి, తన యజమానిని, అతడి కుమారుడిని కాపాడింది. కర్నాటక-ఆంధ్రప్రదేశ్ సరిహద్దు ప్రాంతంలోని సిర్సి తాలూకాలో ఎల్లాపూర్ అటవీ ప్రాంతంలో ఈ సంఘటన జరిగింది.

నాయక్ అనే వ్యక్తి తన కుమారుడు మధుకేశ్వర మరియు తన పెంపుడు కుక్క పింటోతో కలిసి పండుటాకులను సేకరించడానికి అడవికి వెళ్లినప్పుడు వారిపై చిరుత దాడిచేసింది. ఈ దాడిలో నాయక్ గాయపడి ఇప్పటికీ స్థానిక ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నాడు. తమపై చిరుత దాడి చేసినప్పుడు పింటో దానిపైకి దూకి అనేకసార్లు చిరుతను కరిచిందని చెప్పాడు.

పెంపుడు కుక్క దాడిలో గాయపడ్డ చిరుతను నాయక్ తన ఇంటికి తీసుకువచ్చి జరిగిన ఘటనను అటవీ శాఖ అధికారులకు వివరించాడు. దురదృష్టవశాత్తూ అతడి ఇంట్లోనే చిరుత గాయాలతో మరణించింది. అడివిపిల్లి కుటుంబంలోని ఇతర సభ్యుల వలెనే చిరుతపులి కూడా అంతరిస్తున్న ప్రాణులలో ఒకటిగా మారింది.

విదూషకుడు

బీర్బల్



# అక్బర్, అల్లుడు



1. ఒక రోజు, ఉన్నప్పుడు విష్ణువు తన భక్తుడైన గజేంద్రుని మొర చెవినబడగానే భూమ్మీదికి పరుగెత్తుకొచ్చి అతడిని కాపాడిన వైనాన్ని బీర్బల్ అక్బర్‌కు చెప్పసాగాడు.



2. దేవుడు తన బంట్లలో ఒకరిని ఎందుకు పంపించలేకపోయాడని అక్బర్ ఆశ్చర్యపోయాడు. బీర్బల్ మిగిలిన కథను తర్వాత చెబుతానన్నాడు.



3. మరుసటి రోజు, బీర్బల్ రాజోద్యానవనంలో అడుగు పెట్టాడు. పనిమనిషి అక్బర్ మనవడిని ఎత్తుకుని ఉండటం చూశాడు. పసివాడి స్థానంలో మైనపు బొమ్మను ఉంచి ఆమెతో ఏదో చెప్పాడు.



4. పనిమనిషి ఉద్యానవనంలోని చెరువులోకి జారి పడినట్లుగా నటించింది. పెద్దగా కేకవేసింది. అయ్యో పిల్లవాడు. పాదుషా, పసిబిడ్డను కాపాడండి.



5. చెరువు అవతల ఉన్న చక్రవర్తి ఆమె కేకలు విన్నాడు. ఒక్కసారిగా చెరువులోకి దూకాడు.


6. అక్బర్ పసివాడిని పైకి లాగి చెరువులోంచి బయటకు వచ్చాడు. అది మైనపు బొమ్మ అని గ్రహించాడు. నా మనవడెక్కడ అనడిగాడు. భద్రంగా ఉన్నాడు షెహన్‌షా!


7. అక్బర్ ఆగ్రహోదగ్రుడయ్యాడు. నామీదే జిత్తు ప్రయోగిస్తావా, ఎంత ధైర్యం? అన్నాడు. బీర్బల్ నవ్వాడు. విష్ణువు తనకు తానే భూమ్మీదికి ఎందుకొచ్చాడో అర్థమైందా ప్రభూ?


8. అక్బర్ తీక్షణంగా చూశాడు. ఏం చెబుతున్నావు? అన్నాడు. మీరు పిల్లవాడి కోసం మీ భటులను కేకెయ్యలేదు. మీరే ఎందుకు చెరువులోకి దూకలేదు ప్రభూ!


9. బీర్బల్ కొనసాగించాడు. మీ మనవడంటే మీకు ఇష్టం కాబట్టే మీరలా చేశారు. దేవుడు కూడా తన భక్తుడిని ఇష్టపడ్డాడు కాబట్టే ఏనుగును కాపాడటానికి ఉన్నఫళానా వచ్చేశాడు మరి.

## క్లోనింగ్ అంటే...

డాలీ అన్న పేరు మనకందరికీ పరిచితమైనదే. అయినా, మనం ఇక్కడ చెబుతున్న 'డాలీ' ఒక గొర్రెపిల్ల పేరు. నిజంగానే అపూర్వమైన ప్రత్యేకతను సంతరించుకున్న గొర్రెపిల్ల అది. ప్రపంచంలో క్లోనింగ్ ప్రక్రియ ద్వారా ప్రప్రథమంగా పుట్టిన జంతువు అది. అచ్చం తల్లిలాగే కనిపించే డాలీ, తల్లి కన్నా ఆరేళ్ళు చిన్నదే అయినప్పటికీ దాని కవల జంటలా కనిపిస్తోంది. పైగా దానికి తండ్రి లేడు!

మన శరీరాలు అసంఖ్యాకమైన జీవకణాలతో తయారైనవని మనకందరికీ తెలుసు. కణాల్లో ఎన్ డి ఏ రూపంలో మనకు సంబంధించిన సమాచారం నిండి వుంటుంది. దీనిని 'జెనెటిక్ కోడ్' అని అంటారు. ప్రతి జీవి కూడా ఇందులోని సగం సమాచారం తండ్రి నుంచీ, తక్కిన సగం సమాచారం తల్లి నుంచీ పొందుతుంది. క్లోనింగ్ విధానంలో శాస్త్రవేత్తలు, ఒక జంతుకణం నుంచి డి ఎన్ ఏను విడదీసి, దాన్ని వేరొక జంతువు నుంచి సేకరించిన అండకణంలో ప్రవేశపెడతారు. అలా ప్రవేశపెట్టే ముందు, గ్రహీత కణంలోని డి ఎన్ ఏను తొలగిస్తారు. డాలీ గొర్రెపిల్ల అక్షరాలా అలాగే రూపొందించబడింది!

# వివిధ వృత్తులు

ఈనెల సంచికలో వివిధ వృత్తులతో కూడిన చిత్రాలతో స్క్రాప్ బుక్ తయారు చేద్దాము రండి.


















